## ఈ నాటకమునవచ్చు పాత్రలు

### పురుషులు

1. ధ్రువసింధుఁడు — అయోధ్యకు రాజు
2. ధీమంతుఁడు — ధ్రువసింధునిమంత్రి
3. సుదర్శనుఁడు — పట్టపుదేవికొమరుఁడు — కథానాయకుఁడు
4. శత్రుజిత్తు — రెండవభార్యకొమారుఁడు
5. యుధాజిత్తు — శత్రుజిత్తుతాతగారు
6. వీరసేనుఁడు — కథానాయకునితాతగారు
7. సుబాహుఁడు — శశికళతండ్రి — కాశీరాజు
8. భరద్వాజుఁడు — మహర్షి
9. కౌశికుఁడు — భరద్వాజునిశిష్యుఁడు
10. కాలనేమి — యుధాజిత్తుసహాయకారి
11. ప్రతాపసేనుఁడు — సామంతుఁడు

### స్త్రీలు

1. మనోరమ — ధ్రువసింధునిపట్టపుదేవి
2. లీలావతి — ధ్రువసింధునిరెండవభార్య
3. శశికళ — కథానాయకి
4. చిత్రసేన — సుబాహునిభార్య
5. చిత్రభాషిణి — శశికళచెలికత్తె

కొందఱుపౌరులు — భటులు — సందర్భానుసారముగావత్తురు.

# విజ్ఞప్తి

పాఠకమహాశయులారా!

శశికళ అను యీ చిన్నిపాత్తమును దృశ్యప్రబంధముగ వ్రాయుటకు కొంతమంది మిత్రులునన్ను బహువిధముల ప్రోత్సాహ మొనర్చుటచే రమారమి ఇప్పటికి 5—6 సం॥ రములక్రిందటనే, శ్రీ దేవీభాగవతమందలి యితివృత్తమగు దీనిని తొందరలో వ్రాయవలసి వచ్చెను. ఏదోవిధముగ గ్రంథసంపూర్తి గావించితినిగాని కొన్నిబాధ లలో నిమగ్నుడనై ముద్రణాదికమునకు ప్రయత్నింపకుంటిని. ప్రస్తు తం పశ్చిమగోదావరిజిల్లా చింతలపూడి తా॥ రంగాపురంలో ప్రతిష్టి తుడగు శ్రీ సత్యనారాయణస్వామివారు అనుగ్రహమున శ్రీ ఈదర వెంకయ్య, పట్టాభిరామయ్యగార్ల హృదయపరివర్తనుడై ఆజ్ఞాపించుట వలన ఆతండ్రి కుమారులీ నాటకమును తమ ముద్రణాలయమున ముద్రిత మొనర్చి లోకమున వెల్వరించిరి.

ఇందుండు లోపాలోపములను తెలిపినచో ద్వితీయముద్రణ మున సరిదిద్దుకొందును.

నా యీ నాటకప్రకాశకులకు సమస్తాభీష్టసిద్ధి కలిగించుచు రక్షించుటకు శ్రీసత్యనారాయణస్వామివారిని ప్రార్థించెదను.

సూర్యాపేట,
26—12—56,

ఇట్లు,
గ్రంథకర్త.



గ్రంథకర్త

శ్రీమాన్ ఆసూరిమరింగంటి వేంకట నరసింహాచార్యులుగారు

# అంకితము



శా॥ శ్రీరంగాపుర దివ్యసౌధమున ల
క్ష్మీయుక్తుడై భక్త బృం
దారాధ్యుండగుచు న్నిరంతరము బ్ర
హ్మానందముఁ గూర్చి వి
స్తారప్రీతి నఖండవైభవము ల
శ్రాంతంబు సంధించి యిం
పారన్నేలెడు, "సత్యదేవునకు" నే
నర్పింతు నేతత్కృతిఁ.



శ్రీ ర స్తు

## కృతిప్రకాశక ప్రశంస

శా. శ్రీరమ్యంబయి సర్వసంపదలచే జెన్నొందు హేలాపురిన్
ధీరోదాత్తగుణాఢ్యుఁడై ప్రబల కీర్తి ప్రాభవోపేతుఁడై
భారద్వాజ పవిత్ర గోత్రియుతుఁడై పట్టాభిరామాఖ్యుఁడిం
పారన్నిదరవంశవార్ధి శశియై హర్షాంబుధిన్ దేలెడున్

గీ. ఆరువేల నియోగులం దధికుఁడనఁగ
ఘనుఁడు పట్టాభిరామాఖ్యుఁ డనుపమాన
సాధ్వి "శ్రీయన్నపూర్ణకు సాటి" లక్ష్మి
నరసమాంబను జేపట్టి సురుచిరముగ.

మ. ధనధాన్యాది సమస్తభాగ్యములచే దాంపత్యమత్యంత ప్రీ
తిని శోభిల్లుచు పుణ్యకార్యరచనాసక్తిం బ్రశేష్ఠతన్గాంచి కీ
ర్తిని రాణించెద రట్టిదంపతుల ప్రాప్తిన్జేసి బుత్రత్రయం
బనఘుల్ గల్గిరి తల్లిదండ్రులెద నాహ్లాదింప నవ్వారిలోన్.

చ. ప్రథమతనూజుఁడై వెలసె రామయమంత్రి. ద్వితీయపుత్రుఁడై
పృథుతరకీర్తిఁ గాంచె పృథివిస్థలి వేంకటరావనంగ ధీ
నిధియగు వేంకయాగ్రణి గణింప తృతీయకుమారవర్యుఁడ
య్యె, ధరనగణ్యపుణ్యఫలమెంతయుఁ జెందుచు నర్హపద్ధతిన్.

గీ. ఆంధ్ర గీర్వాణ సారస్వతాభిమాని
యనఁ బ్రసిద్ధి వహించుచు జనులు మెచ్చ
ముద్రణాలయముం బ్రీతి పొందుపరచి
తగు విధంబునఁ బోషింప ధన్యుఁడగుచు.

ఉ. "ఈదర వంశమందు" పరమేశ్వర దివ్యకటాక్షవీక్షణా
మోదయశః ప్రశస్త గుణపూరిత సాధుజనానుకూల భా

గోత్రోదయ పుణ్యశాలియైన § నొప్పుచు వేంకయ మంత్రిపుంగవుం
డాదరణాభిమాన పరకమాన్యత కార్యధురీణుండై తగన్. 6

గీ. పరమ సాధ్వీలలామయా § పార్వతమ్మ
నెలమి కల్యాణమున్గాంచి § సలలితముగ
భోగభాగ్యాతిశయముల § భువినగణ్య
పుణ్యకార్య వ్రతాచారకములు వెలార్చి. 7

సీ. దేవతా భక్తిని § తీర్థయాత్రలు సల్పి
ప్రఖ్యాతి జెందిన § భవ్యుఁడనఁగ
స్వకులోచితాచార § సరణిఁదప్పకచాల
నిష్ఠగావర్తించు § నిపుణుఁడనఁగ
బీదసాదలయందు § ప్రియభావమునుజూపి
దానధర్మములిచ్చు § ధన్యుఁడనఁగ
పండితాదరణీయ § పటిమంబు వెలయించి
చిరకీర్తిఁగాంచిన § శ్రేష్ఠుఁడనఁగ

గీ. దనరు వేంకయ్య సచివ సత్తముఁడు ధాత్రి
బుత్రు పట్టాభిరామాఖ్యు § బుణ్యతముని
గూర్మి లక్ష్మీనరసమ్మ యన్ § గూతుఁగాంచి
పెంచి పెద్దలఁగావించి § వేడ్కతోడ. 8

గీ. భోగరాజాన్వయుండైన § బుచ్చిరామ
యాఖ్యునకు లక్ష్మీనరసమ్మ § నధిక మోద
మెనయ పరిణయ మొనరించి § ఘనులు బొగడ
పండిత కవీంద్ర సంస్తవ § పాత్రుఁడగుచు. 9

చ. తనయునకీడు జోడయిన § ధన్యచరిత్రను లక్ష్మీనరసమాం
బను దగపెండ్లి సల్పి నిజ § వంశ పవిత్రత సాటుచున్ సదా

వనజదళాక్షుఁడౌ హరి, కృపామతి మన్మల మన్మరాంధ్ర వే
ద్యునిగాని, వేంకయామాత్యుని | గాతుక మొందుచునుండ
నిమ్మహిన్. 10

గీ. సద్గుణానంద భరితుఁడై | శాంతి సత్య
నీతి రతుఁడన విఖ్యాతి | రీతినలరి
మహిత పట్టాభిరామాఖ్య | మంత్రి తిలకుఁ
డాశ్రితాభీష్ట ఫలదుఁడై | యనవియంచు. 11

గీ. తండ్రియానతిఁదలదాల్చి | ధన్యశాలి
యైన సుమతి పట్టాభిరామాభిధేయుఁ
డార్య సన్నుతపాత్రుఁడై | యనుపమాన
కీర్తి కరుడౌచునొప్పె నీక్షితి గణింప. 12

మ. కొడుకుల్ గోడలు కూతురల్లుడును లోకుల్మెచ్చ నిత్యంబుఁ దో
డ్పడగన్ వేంకయమంత్రిపుంగవుఁడు వేడ్కన్దేలి యీపొత్తమున్
పుడమిన్ ముద్రణమాచరించి కవు సొంపున్బెంపు దీపింప బా
ల్పడుటన్ పండితసన్నుతార్హుఁడగుచున్ | భాసిల్లునుర్వీస్థలిన్ 13

గీ. మత్కృతీశ్వరుఁడగు శౌరి | మాధవుండు
సత్యనారాయణస్వామి | సకల శుభము
లిడుచు "సీదర వేంకయ" | నిద్ధచరితు
నేలు సకుటుంబముగ గృపాశాలి యగుచు. 14

గీ. ఆయురారోగ్య పుత్రపౌత్రార్థ సకల
భోగ భాగ్యంబులన్ గూర్చి | పూర్ణకృపను
శ్రీమహాలక్ష్మి పోషించు | శిష్టమతిని
వేంకయామాత్యవర్యుని | ప్రీతిగదుర.

సమస్త సన్మంగళానిభవంతు

ఓమ్.

శ్రీ ర స్తు

శ్రీమతే రామానుజాయనమః




ఉ॥ శ్రీమహిళామనోహరుఁడు చిన్మయుఁడాద్యుఁడు సర్వశేషి సు
త్రామ ముఖామరార్చిత పదద్వయుఁడచ్యుతుఁడబ్జనాభుఁడు
గామితదాయకుండఖిల కల్మషదూరుఁడు సత్యదేవుఁడీ
కోమలకావ్యకన్యకను కూర్మినిజేకొని నేలుగావుతన్.

## ప్ర థ మాం క ము

### 1-వ రంగము

(విహారభవనమున - ధ్రువసింధుఁడు - ధీమంతుఁడు - ప్రవేశింతురు.)

ధీమం :—మహాప్రభూ! అనుపమానశక్తిప్రభావసంపన్నులై ఆశ్రితాభీష్టప్రదులై అనవరతధర్మాధర్మవిమర్శనాపేక్షాదీక్షితులై శౌర్యౌదార్యగాంభీర్యచాతుర్యధుర్యులై సుగుణరత్నాకరులై సకల రాజన్య శిరఃకిరీటరత్నపూజితాంఘ్రివిరాజిత దిగంతకీర్తి విశ్రాంతులై ఆసేతుహిమాచలాంతర్గత ధరాతలంబునేకచ్ఛత్రంబుగా పరిపాలింపుచున్న మీరు ముక్కుపచ్చలారని పసిపిల్లవాని దుందుడుకుపనులకింతగా విచారింపఁజెల్లునా?

శా. లోకజ్ఞానములేని కన్నసుతుఁడే ౸ లోపంబు గావించినన్
సాకల్యంబుగ బుద్ధులఁ గఱపి వాత్సల్యంబుదీపింప న
స్తోకప్రీతిని సాధువర్తనము సెంగ్రతోయుక్తియుక్తంబుగా
జేకూర్పఁదగు తల్లిదండ్రులిలపై శిక్షాళిమేల్మెలనన్.

ధ్రువ :— ధీమంతా, కన్నకొడుకని యూరకొన్నకొలఁది అదురు బెదురు లేకుండ తుంటరులఁజతగూడి స్వేచ్ఛానుసారముగాఁ బ్రవర్తించుటయేగాక పురజనులనష్టకష్టాలఁబెట్టుచు పాపభయ మెఱుంగనిపలుగాకియై చరింపుచుండ చూచి సహించుట దుర్భరము ! దుర్భరము!!

చ. జనకునికీర్తి నడ్డిశలఁ ౸ జాటగలట్టి సుతుండొకండె చా
లును కులహీనులౌ తనయులఁ బదిమందిజనింపనేల? ధా
త్రిని శశిలేనినాకసము ౸ దీర్చినజుక్కలు పెక్కుఁగల్గినన్
గనులకుపండువౌనె? త్రిజ ౸ గంబులకున్నతతేజమబ్బునే?.

అమాత్యపుంగవా! దుర్మార్గుడగు వానిమూలమున వంశమునకు తీరనికళంకమేగాకుండ ధనధనేతరాది సర్వస్వము నశించును. కుటిలాలోచనపారంగతుండగు సుయోధనుని కారణంబున కురువంశ మంతరింపలేదా?

ధీమ :—ఏలినవారన్యథా తలంపుచుండ సేవకుడ నేనేమి మారుపల్కఁ జాలుదును ?

మ. వయసామీఱగలేదు బుద్ధికుశలం ౸ బా!జూడశూన్యంబు వి
ద్యయెుకింతైననురాదు రాజ్యపదలా ౸ భాపత్తియుఁ లేదు ని
ర్భయవృత్తిఁదిరుగాడనోపఁడు స్వతం ౸ త్రప్రాప్తిలేనట్టి మీ
ప్రియపుత్రుండతనిఁ గుఱించి కలత ౸ న్బొంపంగ మేలానృపా!

షోడశవర్షప్రాయుండగు కుమారుడు తెలిసితెలియక చేసిన దుండగములుసహించుట తల్లిదండ్రులకేబాధగాఁ దోచినచో పరులెట్లుసమ్మతింతురు? పదిమందినోటిలోబడిన ఆచిఱుత యేవిధముగా తలయెత్తుకొని జీవింపఁగలడు?

ధ్రువ :—ధీమంతా నేనుపుత్రప్రేమ లేనివాడనై పల్కుటలేదు. పట్టమహిషిపుత్రుండగు సుదర్శనుడు ప్రాయమునపిన్నవాడైనను సుగుణంబులందు వినయ విధేయ ధీరోదార పరాక్రమచాతుర్యంబులందు నాకెనవచ్చుచు దినదినప్రవర్ధమానయశఃకాముడై సంతతధర్మకార్యాచరణాసక్తచిత్తుండై సానదీర్చిన మాణిక్యంబురీతి విరాజిల్లుచుండ. నాద్వితీయసతీసుతుండగు శత్రుజిత్తు క్షీరసముద్రమునందావిర్భవించిన హాలాహలముపలె సంభవించి యావనమదోన్మత్తుండై యుక్తాయుక్త విచారశూన్యుడై ప్రజలకంతులేని బాధలుగల్గింపుచు నానిర్మలయశశ్చంద్రికల నశింపఁజేయుచు మావంగడమున కపఖ్యాతిఁగూర్చుట నీవెఱుంగనిదియా? అప్పుడప్పుడు శిక్షించిబోధించు, నాహితోపదేశములను మిగుల భయభక్తి గౌరవంబులతో నాకర్ణించి, వర్తింపుచున్నట్లు, మృషావాక్యంబులాడుచు నాయాజ్ఞానుసారముగా నడుచుకొనుచున్నట్లు కుటిలప్రవర్తన ప్రదర్శకుడై ఇదమిత్థమని వచింపనశక్యముగు దుర్మార్గకృత్యంబు లెన్నెన్నియో సలుపుచు పౌరుల కన్నీరు కాల్వలై ప్రవహింపఁజేయుట కర్ణాకర్ణిగ వినియుందుముకదా ! ఇట్టిదుర్మార్గుని ఇట్టిపితృద్రోహిని ఇట్టికులనాశకుని తలనఱుకుటకైనను ఘోరకాంతార పర్వతకందరాంతరాళంబులకంపుటకైనను క్రూరపన్నగదంష్ట్రాభీల విషానలజ్వాలలచే నశింపఁజేయుటకైనను దోచకున్నది. పుత్రవ్యామోహమను కొండయెలుక నాధైర్యప్రాకారముక్రిందట బిఱికికన్నము ద్రవ్వుచున్నది. నిశ్శంకమగు నాసంకల్పమును వికలపరిచి నాహృదయపేటికను శకలపరుచు ఆదుండగీనిపై కనికరముండుటకల్ల ! కల్ల !!

గీ. "తులసివనమున గంజాయి మొలక" పగిది
"పాలకడలిని కలిగిన కాలకూట
విషమురీతిగ" నీతడా విర్భవించి
వంశ మర్యాదలకు భంగ పాటుగూర్చె.

ధీమం :—మహాప్రభూ! తామాకుమారునియందు సామ దాన భేద

దండోపాయంబులనుపయోగించి అతనిచెడునడతలు మాన్పించుట శ్రేయోదాయకమని నాయభిప్రాయము.

గీ. తెలిసి తెలియకచేసిన కలుషములను
దలచి విడనాడ సుంతయు ఫలము లేదు
సానబట్టిన శోభిల్లు మానికంబు
సాధనంబున సర్వంబు సాధువగును.

తమరాష్ట్రమునకెట్టియాపదలురాకుండ నేనప్రమత్తుండనై వీక్షింపుచు కంటికిఱెప్పవోలె గాపాడుచుందును. శత్రుజిత్తు దుర్మార్గవర్తనమునుగురించి మీనిర్మలహృదయంబును సంక్షోభింపజేయవలదు. ఎప్పటికప్పుడే సమయమరసి తగిననీతులను బోధించి కుమారప్రభుని చిత్తవృత్తి మరల్చెదను. వేయేల సాధ్యమగునంతవరకు త్వరలో మీయనుగ్రహపాత్రునిగావించెదను. ఏలినవారు నాపల్కు లంగీకరింపవలయును.

ధ్రువ :—అమాత్యవర్యా ! ఎంతవెఱ్ఱివైతివోయి! "పుట్టినప్పటిబుద్ధి పుడకలతోఁగానిపోదను" సామెతవినలేదా ?

సీ. త్రాచుపామున్ దెచ్చి తనప్రక్కనిడికొన్నఁ
గఱువక విడుచునె కరుణఁబూని
కాలకూటవిషంబుఁ గ్రోలినవానికి
ప్రాణముండునె ? తగుపాటుబడివ
ప్రళయాగ్నికణములు పైవస్త్రమునఁగట్టఁ
బూదిని గావింప లేదా ? దలఁప
విషముష్టిచెట్లను బెంచి పెద్దఁగ జేయ
ఫలమబ్బఁగా మెక్కఁ గలరె జనులు

గీ. అటులనే శత్రుజిత్తు దాఁగుటిలుడగుచు
లోకవిద్రోహ మొనరింప బ్రాకులాడు
గాని సుంతయునీతిని గాంచఁబోడు
వేయుమాటలికేటికి వినుముసచివ.

తీవ్రజలప్రవాహమున మండుచున్న కాఱడవి చల్లారును గాని ఘృతధారలచే జల్లారునా? పయోముఖవిషకుంభసదృశ హృదయులకు నవనీతశర్కరోక్తులు రుచించునా?

చ. శిరమునఁగల్గు రత్నమును । జేకొని త్రాచునుజంపుమాడ్కి దు
ర్భరకపటప్రచారకుని । పండితుడైన కుమారుడైన సో
దరుడయినన్ క్షమింపకయె । దండనసేయుటధర్మమౌ నికే
కరణిసహింతు నీచగుణ । కర్మకుడౌసుతు నేమిసేయుదున్.

ధీమం:—(ముందుకుచూచి) మహారాజులంగారి సంకల్పసమయము నకు కుమారసింహుడిటే విచ్చేయుచున్నట్టున్నది. సమక్షమున హితముఁబోధింప వచ్చును.

ధ్రువ:—జాత్యనుసార మలవడిన దుష్కార్యాచరణపరాయణునకు మనము దెల్పు ధర్మోపన్యాసములు నిరర్థకమేయగును.

సీ. జాత్యంధునకు ముందు । సంధింప ముకురంబు
కనుల కింపుగ జూడ । గలుగు టెట్లు?
క్షారజలాంబుధి । శర్కర గలిపిన
తనివి దీఱఁగఁ గ్రోల । దలఁచు టెట్లు?
రతికంటె సౌందర్య । వతియైన సతిఁగూర్ప
పుంస్త్వహీనుఁడు । దాని పొందు టెట్లు?
జ్వరపీడితునకన్న । శాకంబుఁ బెట్ట
నెలమి జిహ్వకు రుచి । యించు టెట్లు?

గీ. అరయ నారీతి నాపుత్రు । డైన శత్రు
జిత్తునకు నేయునీతులు । జెప్పుచున్న
చవటభూమిని బీజముల్ । జల్లినటుల
నిష్ఫలంబగుసుమ్మిది । నిజముసఖుడ.
అమాత్యపుంగవా! వేయుమాటలేల!

గీ. కులము మర్యాదలనువీడి । తులువబుద్ధి
నిచ్చకములాడునీచుల । హెచ్చరికను

దిరుగువానికి హితము బోధించుటెల్ల
పామునకు పాలుబోసిన పగిదిగాదె ?

ధీమం :—ప్రభువర్యులు క్షమింపవలయును. కుమారునకు తగినంత వరకు బుద్ధిగఱపిచూచెదను.

ధ్రువ :—మంచిది.

(మరియొక దిశనుండి శత్రుజిత్తు ప్రవేశించును.)

శత్రు :—(స్వగతము) ఔరారా! ఈ బడుగుముసలివాండ్లిద్దరేకస్థలంబును బాయక నిరంతరము నావిషయమందేదియో దురాలోచన సేయుచుందురుకదా ? వయోవృద్ధుడగురాజు పట్టమహిషికుమారునిపై కనికరముంచి ఆతనిచర్యలు, ఆతనిప్రవర్తనము, ఆతనిగుణములు సర్వజనాదరణీయములని మాటిమాటికి కొనియాడుటే గాకుండ నన్ను దురాచారలంపటుండనని దుర్మార్గుండనని దూషింపుచు భేదభావమున వర్తింపుచుండును. (ఆలోచించి) ఔను. "తామునిగినది గంగ తావలచినది రంభ" యనుసామెత ఈ వృద్ధరాజునందు సార్థకమగుచున్నది. (వెనుకకుతగ్గి) ఆ ! అదిగో ! "అగ్నికివాయువు సహాయమన్నట్లు" పెడమూర్ఖుడగు, ఈదుష్టప్రధానికూడా పదేపదే నాకుబుద్ధులుజెప్పుటకు సిద్ధపడుచు నేను లేని సమయమున నాపైఁగిట్టనినేరము లెన్నెన్నియోకల్పించి నా తండ్రికోపాగ్నిని రగుల్గొల్పి నాసహచర్యులతో నన్ను శిక్షింపజేయుటకు ప్రయత్నింపుచుండును. కానిమ్ము ఏనాటికైన నాకోరిక ఫలింపకుండునా ? (మంత్రిని ఉద్దేశించి) ఓరీ రాజద్రోహీ ! నీకపటనాటకమింక సాగునని దలంపుచుంటివా ! మాఉప్పు తిని జీవించు నీవు మాలో మాకు మిత్రభేదమూ కలిగించుట. ఛీ! దుర్మార్గుడా ! నీవిప్పుడాలోచించు కపటప్రయత్నములకేనాటికైన నాచే తత్ఫల ప్రతీకారమనుభవింపకపోవు. ఇదియే ప్రబలప్రమాణమనిదలంపుము. (రాజునుసమీపించి) తండ్రీ! అభివాదనము లర్పింపుచున్నాడను. (తండ్రిపాదములపైఁ వ్రాలును.)

ధ్రువ :—దీర్ఘాయుష్యవంతుండవుగమ్ము. (లేవనెత్తి) కుమారా! ఇటురమ్ము కూర్చుండుము.

శత్రు :—చిత్తము (కూర్చుండును)

ధీమం :—ఆయుష్మంతుడా! నీతో కొన్నివిషయములు ముచ్చటింప వలసియున్నవి. వాటికి సదుత్తరమొసంగి తండ్రిగారి మనఃక్లేశము నుపశమింపజేయుదువా?

శత్రు :—(తనలో) ఔరా! ఏమీ దురాత్మువి కపటవాక్చాతుర్యము. కనిపెంచిన తండ్రికన్న మున్ముందే ఈబానిసీడు నన్నువిమర్శింప బూనినాడే? కానిమ్ము ఇందులకు ప్రతిఫలమనుభవింపకపోడు. (ప్రకాశముగ) ఆహా! రాజప్రధానులయాజ్ఞ మాబోంట్లకుసర్వదా ఆచరణీయము.

ధీమం :—క్షత్రియుల కత్యంత శ్రేయోదాయకమేది?

శత్రు :—ప్రజాను రంజకత్వము.

ధీమం :—మానవున కిహపరసాధనీయమేది?

శత్రు :—పితృ మాతృ సేవ.

ధీమం :—రాజులకు ముఖ్యమగు కర్తవ్యమేమి?

శత్రు :—శత్రునిర్మూలన మొనర్చి నిరంకుశాధికారమున జీవించుట.

ధ్రువ :—ఈలాటి ధర్మము లెఱింగిన నీవు దుర్మార్గాలోచనము కుటిల ప్రవర్తనము రాజద్రోహము పౌరజనప్రాణాపాయమేల గుర్తింప కుంటివి?

శత్రు :—(ఆశ్చర్యమున) తండ్రీ! ఇదేమన్యాయము. ఏదోష మెఱుఁగని నిరపరాధియందు నిందారోపణముచేయుట తగునా? దైవసమానులగు తమయెదుట నేనసత్యము లాడుదునా?

ధ్రువ :—(ఇంచుకకోపమవలంబించి) ఏమిరా నీనక్కవినయము. నీవు నిర్దోషివనిపుత్రప్రేమచే నేనెంత యుపేక్షించినను మితిలేని నీదుండగములు వేనోళ్లఁబలుకు ప్రపంచమును ఎవరుమాన్పగలరు?

ఉ. బాలురఁబట్టికొట్టుటయు ౹ పౌరులఁదిట్టుచు రాజమిత్రులన్
కూలికిఁబొట్టకూటికిని ౹ గుడ్డకు నుంటిరటంచు కారులన్
ప్రేలుచు నీచకార్యములు ౹ బెక్కొనరింపుచు రాష్ట్రమంత క
ల్లోలముఁజేయు నీదుమకు ౹ లన్గణియింప వశంబెధారుణిన్.

శత్రు:—తండ్రీ! నాశ్రేయస్సు సహింపని కుటిలచిత్తులెవ్వరో నాపైఁగిట్టక నిట్టినేరములు కల్పించియుందురు. ఇంతమాత్రమున నేనురాజద్రోహి నగుదునా?

ధీమం:—యువరాజా! యదార్థమింకఁదాచిపెట్టలేను. నేవచించు వాక్యములుగ్రహించి కర్తవ్యమును యోచింపుము. నీస్వేచ్ఛా విహారము సర్వజనకంటకమై భూపాలుని హృదయమువైకల్యమొన రింపుచు పరిపూర్ణనిగ్రహమునకు గుఱిగావింపుచున్నది. నిర్మలమగు వంశమున కపఖ్యాతి కలుగుచుండెనను పరితాప మంతకంతకు నధికమై ఏలినవారి బుద్ధిబలముతోపాటు దేహబలముకూడ క్షీణింపుచున్నది. కుమారా! నీవింతటినుండి చెడుసహవాసము విడువకున్నచో తీవ్రమగు రాజదండనమునకు పాత్రుడవుకావలసి వచ్చును. "చెడిచింతించుట హానికరము" ఆయుష్మంతుడా! నిరంతరము నీయభివృద్ధిగోరుచుండు పెద్దల హితప్రవచనము సర్వదా నీకుక్షేమమగును.

శత్రు:—(తనలో) ఔరౌరా! ఏమి ఈతనికుతంత్రబుద్ధి. ఏకాంతమున తండ్రికినాయందు నిగ్రహముకలిగించి సమక్షమున స్నేహభావ మును సూచింపుచున్నాడే! (ప్రకాశముగ) రాజశాసన మనుల్లంఘ నీయము. నిర్దోషిపై అపరాధస్థాపనము మిక్కిలిశోచనీయము!

ధీమం:—కుమారా! నీవనపరాధివని నేనింతకుముందే ప్రభువర్యులకు నివేదించితిని. కాని జనులయులజడిచే సార్వభౌమునకు శాంతి లభింపకున్నది. వత్సరాజా! మనోవ్యాధికిమందులేదు. ప్రస్తుతము రాజేంద్రుని మనస్తాప ముపశమింపజేయుటకు నీసత్ప్రవర్తనమే దివ్యౌషధమగును. (రాజునుచూచి) మహాప్రభూ!

ముక్కుపచ్చలారని ఈబాలకునికతాపరాధములింతవరకు ప్రథమ దోషముగా క్షమింపప్రార్థించెద! (చేతులు జోడించును)

ధ్రువ :—చిరంజీవీ! ఇంతవరకు నీవు చేసిన దుండగములన్నియు మన్నించితిని. ఇకముందేనాడైన నీయందపరాధ స్థాపన మైనచో నిర్దయుడనై దండింపక తప్పదు. వింటివా జాగ్రత్త!

శత్రు :—చిత్తము (తలవంచుకొనును)

ధ్రువ :—ధీమంతా! నీవిప్పటినుండి శత్రుజిత్తు ప్రవర్తనము విమర్శింపుచు రాష్ట్రజనులకెట్టి యాపదలు వాటిల్లకుండ గాపాడుచుండవలయును.

ధీమం :—మహాప్రసాదము! ఏలినవారియాజ్ఞ శిరసావహించెద!

ధ్రువ :—మంచిది (నిష్క్రమించును)

ధీమం :—నాయనా! యువరాజా! రహస్యముగా కొన్ని విషయములు నీతో చెప్పవలసియున్నవి రమ్మి.

శత్రు :—నిస్సందేహముగా వినగోరెదను.

(శత్రుజిత్తు చెయ్యిపట్టుకొని ధీమంతుడు నిష్క్రమించును)

## 2–వ రంగము

(సభయందు–ధ్రువసింధుడు–ధీమంతుడు సభ్యులు ప్రవేశింతురు.)

ధ్రువ :—ధీమంతా! రాజ్యవిశేషములెవ్వియైనగలవా?

ధీమం :—మహాప్రభూ! ఏలినవారి యనుగ్రహమునకు పాత్రులై నానాదేశాధీశ్వరులు నియమితకాలమునకు కప్పంబులు జెల్లింపుచుండిరి. ప్రజలు రాజభక్తి విశ్వాసంబులతోపాటు భోగభాగ్యములనుభవింపుచు నేయుపద్రవములేక రామరాజ్యమని వేనోళ్ళగొనియాడుచుండిరి. దండనాయకాది సర్వసైన్యంబు లప్రమత్తులై స్వామికార్యనిర్వాహకపరాయణులై వేచియుండిరి. కుమారాది సామంతులు భవదాజ్ఞాబద్ధులై చరింతురనుటలో సందేహములేదు.

(తెరలో) సామీ! రచ్చించాల! రచ్చించాల!!

ధ్రువ :—(ఆతురతతో) ఏమి దీ యార్తానాదము!

ధీమం :—కారణము దురూహ్యము!

(భటుడు ప్రవేశించి) శ్రీ శ్రీ శ్రీ ధ్రువసింధు మహీపాలున కభి వందనములు (తలవంచి నమస్కరించును.)

ధీమం :—సేవకా! సింహద్వారము చెంత నేమిటా ప్రజలయలజడి?

భటు :—కామందులవారి సందర్శనముగోరి పౌరులు హజారంబు వేచియుండిరి.

ధ్రువ :—మంచిది! తక్షణమే వారిని లోనికిరానిమ్ము! నీవికపొమ్ము.

భటు :—చిత్తము (నిష్క్రమించును)

ధీమం :—(తనలో) పౌరులు దీనాలాపములచే భూపాలునిచూడ గోరుట కేమి కారణము చెప్పుమా? (దీర్ఘాలోచనవహించును)

శత్రు :—(తనలో) ఈదుర్మార్గప్రజలు రాజుకడకువచ్చుట కేమికారణమై యుండును? యొకవేళ నాపై కొండెములుచెప్పుటకు కాదుగదా? (ఆలోచించి) ఐన కావచ్చును. "యధారాజా తధాప్రజా" యనుసామెత వ్యర్థమగునా? ఈమూర్ఖులకారణముగా నాతో వైరము సంపాదించుకొని ముందేవిధముగా ధన మాన ప్రాణములు గోల్పోవక నెట్లు బ్రతికెదరో చూచెదగాక? ఈ శత్రుజిత్తుతో విరోధము దెచ్చుకొనుట

మ. పుడమిన్ బెబ్బులిమీసలంటినటులన్ గ్రూదండగా సర్పమున్
మెడలోఁదాల్చినమాడ్కి యగ్నికణముల్ శ్మేలైనవస్త్రంబునన్
ముడిగట్టన్ దలపోయులీల బ్రజలీ భూపాలునిన్జేరి త
ప్పిడి నాపైనధర్మితి జీవములతో నేరీతివర్తింతురో?

(ముందుకుపరికించి) అదిగో పౌరులు రాదొడంగిరి.

(తిరిగి భటుడు పౌరులతో ప్రవేశించును.)

పౌరులు :—సామీ! దండాలు! దండాలు! రచ్చించాల! రచ్చించాల!!
(అందఱు భూమిపై బడి నమస్కరింపుచుందురు)

ధ్రువ :—పౌరులారా! లెండు. భయపడవలదు. మీకందరికి క్షేమమేనా?

పౌరులులేచి:—మహాపెబూ? మా సేమమేమి సెప్పదుము (తలవంతురు)

ధీమం :—ఓయీ! మీ మీ కష్టములు నిర్భయముగా ఏలినవారికి విన్నవింపుడు.

శత్రు :—(తనలో) ఈమూఢులు నాయందే నేరములైన కలిపించి చెప్పినచో ఇప్పుడు నాకు కర్తవ్యమేమి చెప్పుమా? (ఆలోచించి) కర్తవ్యమునకేమున్నది. (ఒరనుండు కత్తిదెబికి) గజంబులపైఁబడు సింహపు కొదమవలె లంఘించి అవక్ర పరాక్రమంబుతో మంత్రిసహితంబుగా రాజ శిరంబు నజికిధరావలయంబున డొల్లఁ జేయుటే కర్తవ్యమగును.

(ఇంచుక కన్నెఱ్ఱగా పౌరులఁజూచుచుండును)

పౌరులు :—తల్లి దండ్రుల్లాంటి పెబులోరికి మనవి సేయకుంటె మాకింకేం దిక్కుంది బాబయ్యా!

ధ్రువ :—ఓయీ! మీబాధలు నిర్భయముగా జెప్పుడు సందేహింపవలదు.

మొ-పౌ :—చిత్తం బాబయ్యా! చిత్తగించండి

గీ. పంటచేలన్ని పాడయ్యె ॥ పసులఁగాయు
జీతగానికి నాయువు ॥ చెల్లిపోయె
పెద్దపులులెల్ల మాకాపు ॥ పెద్దలయ్యె
చెప్పఁజాలము మాకున్న ॥ చిక్కులయ్య!

రెం-పౌ :—మాకట్టాలు సెప్పుట కంతులేవుబాబూ! మొన్నరేతిరి

మాసినోళ్ళదు నేనుకావలికెల్లితె సారలప్పులొచ్చి దొక్కశీల్చి శెండాడి గుండెకాయ గుటుక్కున మింగేశిందిదొరా !

(ఏడ్వనారంభించును)

మూ-పౌ :—నిచ్చయంగసామీ ! మేమీ కట్టాలుపడలేం !

పౌరులు :—(దుఃఖమవలంబించి) సత్తెం శెప్తాం, వినోండిబాబయ్యా ఇనోండి !! ఈపాడుమెకాల సిక్కులకు బరించలేం మరొకూరెల్లిపోతాం సెలవిప్పించండి.

శత్రు :—(తనలో) ఇప్పటికి నా అనుమాన రాహిత్యమైనది.

ధ్రువ :—పౌరులారా ! వలదు ! భయపడవలదు !! ఆదుష్టమృగముల జంపుటే కష్టసాధ్యమా ? ఇంతమాత్రమునకే మీరు భయగ్రస్తులై గ్రామమును విడిచిపోదలంపవలయునా ? ఈధ్రువసింధుని బొందిలో ప్రాణములున్నంతవరకు మీకెట్టిబాధలు రాకుండ కన్నబిడ్డలవలె కాపాడజాలుదనని దలంపుడు. మీప్రజాక్షేమమే నాక్షేమము మీసౌఖ్యమేనాసౌఖ్యము మీఆనందమేనాఆనందము మీరింక నిర్భయముగా నిండ్లకుపొండు నే సూర్యోదయాత్పూర్వము సర్వసైన్యసమేతుండనై దుర్గమారణ్యంబులకరుదెంచి క్రూరమృగముల సంహరించి మీబాధతొలగించెదను

పౌరు :—చిత్తం ! బాబయ్యా ! చిత్తం ! ఏలినోరిసెలవు ప్రకారం నడుచుకుంటాము !

ధ్రువ :—మంచిది మీ మీ యిండ్లకుపొండు ?

పౌరు :—దండాలుసామీ ! బిడ్డల్లాంటివాండ్లం ! కనిపెట్టాలి !

(నమస్కరిస్తూ నిష్క్రమింతురు)

ధ్రువ :—ధీమంతా ! వింటివా !

ధీమం :—చిత్తం ప్రజల కష్టసుఖములు విమర్శించుటే మనకిప్పుడు ముఖ్యము.

ధ్రువ :—ఔను మృగసంహారమున కవసరములగు పరికరములతో వేటకాండ్రనుషఃకాలమున పురినివెడలుటకు నాయాజ్ఞ పాటింప జేయుము; నీవు సన్నద్ధుండవై రమ్ము.

ధీమం :—చిత్తమట్లే యొనర్చెదను.

ధ్రువ :—వేళయతిక్రమించినది నేటికి సభచాలింతము.

(అందఱు నిష్క్రమింతురు)

3-వ రంగము

(సౌధమున మనోరమ లీలావతి ప్రవేశింతురు)

లీలా :—(తనలో) హా! హతవిధీ! సకలసామ్రాజ్యవైభవాభిరాముం డగు చక్రవర్తి కర్ధాంగలక్ష్మినగుటకు సంతసించితినేగాని సపత్నిద్వేషమంకురించుట గుర్తింపనైతినే! మనోహరుండు పట్టమహిషి యందుండు గౌరవాతిశయ ప్రేమవిశేషంబులందు శతాంశమైన నాయందు ప్రసరింపఁజేయకుండెనే? ఇప్పుడీ సవతిపోరు నాహృదయమును కలుకుటంపమువలెఁ గోయుచుండ నిర్విచారముగా నేను బ్రతుకగలనా? ఇప్పుడేమిసేయుదును ఏమిసేయకుందును! (ఆలోచించి) రాజేంద్రుడు తనజ్యేష్ఠసతీసుతులపై యుండు అనురాగము మాపైఁజూపకుండుటయేగాక మిూఁదుమిక్కిలి నాకుమారునిపై లేనిపోని కొండెములు కల్పించి నలుగురిలో చులుకనగాపలుకుచు తిరస్కరించుటయా ?

మనో :—సోదరీ! నేడు నీముఖఫలకమునవిచారప్రతిమలు చిత్రవిచిత్రముగా పొడగట్టుటకు కారణమెఱుంగతగుదునా?

లీలా :—అక్కా! నీకు తెల్పుని, రహస్యమొందుగలదా ?

మనో :—సందేహములేకున్నచో వచింపుము నీమనోవైకల్యమును ఆర్యపుత్త్రునకెఱిగించి నీకోరిక సాఫల్యమొనరింప ప్రార్థించెదను.

లీలా :—విభునకుఁదెల్పునంతటి ఘనకార్యమేమున్నది? పట్టమహిషివగునీకు మాయందిప్పుడున్న వాత్సల్యమెప్పటికి యొకేవిధంబుగ నుండునా! లేదా! యని నాడెందము కొందల పడుచున్నది.

మనో:—అయ్యో, వెఱ్ఱితల్లీ! నీవెంత పొరపడుచుంటివమ్మా, ఘటనాఘటనసమర్థుడగు పరమాత్ముని సంకల్పముచేత మనమిఱువురము సార్వభౌముని పత్నులమైనప్పుడు భేదాభిప్రాయములతో నుండుట హేయముకాదా?

చ. పరువు ప్రతిష్ఠలన్ విడిచి • భర్త కసహ్యముఁగల్గఁజేసి చూ
పరులకు వింతఁగూర్చి నిర • పాయసుఖంబులనీసడించి దు
ర్భరపరితాపమున్గొని స • పత్నివిరోధముఁబూనుకంటె భీ
కరమగుమృత్యువాతఁబడఁ • గల్గుట శ్రేయముఁగాదె సోదరీ!

లీలా! వేయేల! మనస్ఫూర్తిగాఁ దెలుపుచుంటివినుము!

గీ. "పాలు నీరేకమైయొప్పు • పగిది" మనము
ప్రేమ లతనాటి వృద్ధిగా • వింపవలయు
స్వప్నమందైన నీయందు • వైరభావ
మును దలఁపను యిదియె నా • తనయుసాక్షి.

సోదరీ! త్రికరణ శుద్ధిగా నామాటలు విశ్వసింపుము! విశ్వసింపుము!! నీసౌఖ్యమే నాసౌఖ్యము! నీసంతోషమే! నాసంతోషము!! (చేతిలో చెయ్యివైచి) లీలా! వేయేల! నా ప్రాణధనమైనను నీకొఱకు ధారవోయుదును.

లీలా:—(తనలో) పాపము ఈఅమాయకురాలు నామాటలు సత్యమని భావించుచున్నది. కానిమ్ము. ఈమె హృదయంబునకు నమ్మకము బుట్టునట్లు వర్తించుచు మీదటి కార్యక్రమమాలోచింపవలయును, (ప్రకాశముగ) మహారాణీ! మనస్ఫూర్తిగా నేనదే భావించుచుంటిని. (ముందుకుపరికించి) అదిగో జీవితేశ్వరుడరుదెంచుచున్నట్లున్నది.

(ఇరువురు తొందరగ లేచి ముందుకు నడతురు)

(విచారమున ధ్రువసింధుడు ప్రవేశించును)

మనో }
లీలా } ఆర్యపుత్రుల కభివాదనములు. (నమస్కరింతురు)

ధ్రువ :—దేవేరులకభ్యుదయపరంపరాభివృద్ధియగుగాక! (కూర్చుండును)

మనో :—మహారాజుగారి ముఖము నేఁడెందులకో విన్నదనము సూచింపుచున్నది కారణమేమైయుండును?

లీలా :—ప్రభూ!

గీ. పూర్ణచంద్రుని నిరసించు ॥ ముద్దుమొగము
వన్నెతగ్గెను నిశియందు ॥ పద్మమటుల
ప్రబలకారణమేదియో ॥ పత్నులకును
దాచకయె దెల్పఁదగునింక ॥ ధారుణీంద్ర.

ఏలినవారి పరిపూర్ణానుగ్రహపాత్రురాండ్రమగు మాహృదయములు సంశయనివృత్తికై త్వరపడుచున్నవి.

ధ్రువ :—నాహృదయ పరితాపమాలకింపుఁడు

చ. కడువడిక్రూరజంతువులు ॥ కర్షకులన్ జెదరించి జంపుచున్
విడబడి పంటపైరులు భుజించిన్ జెడద్రొక్కుచు కాపురుండు వా
రడుగిడ చంపబూనుకొను ॥ సంచు నభయంబున నన్యదేశముల్
బడయుదలంతు రావిషయ ॥ భారము పైపడఁగ దుర్భరంబగున్.

మృగబాధలచే భగ్నహృదయులగు పౌరుల దీనాలాపములువిని నేను నిర్విచారముగా నుండుటెట్లుసంభవించును :

గీ॥ పౌర జనములు కడగండ్లఁబడుచునుండఁ
జూచి చెవులార విన్న యా ॥ క్షోణివిభుఁడు
ప్రజలఁగాపాడడేని త ॥ త్పాపఫలము
ననుభవింపఁడె? జన్మ జన్మాంతరముల.

వేయుమాటలేల శరణన్నవారిని బోషించుటయే నాకర్తవ్యము. పురజనుల గోడాలకించినప్పటినుండి నామనోవైకల్యమున కవధి గాన్పింపకున్నది.

మనో :—క్రూరజంతుసంతానముల నంతరింపఁజేయ సమర్థులగు వేటకాండ్రు వేలకొలదిగానుండ ఇంతమాత్రమునకే ప్రభువర్యులు విచారింపఁజెల్లునా?

ధ్రువ :—ఔను! వేటకాండ్రేగాదు ఉషఃకాలమున స్వయముగా దుర్గమారణ్యమందు మృగసంహారమున కఱుగనిశ్చయించితిని.

మనో :—(ఉలికిపడి) ఏమిదీ! యాశ్చర్యము? ఆర్యపుత్రులరణ్యమున కఱుగుదురన్నమాటవిన్నంతనే నాహృదయములవటింపుచు, గుండె తట తట కొట్టుకొనుచున్నది. (పకాశముగ) మహాభాగా! సర్వ మెఱింగినమీకు విన్నవించునంతటి సమర్థురాలను కాను. నా సాహసమునకు క్షమించి నా ప్రార్థన మంగీకరింపుము

గీ. ఆట జూదము పానంబు ✽ మాటబిఱుసు
లాది వ్యసనంబు లేడును ✽ భువిని నృపుల
కర్మములు గావటండ్రుపో ✽ యార్యులెల్ల
గాన, మృగయావినోదంబు ✽ మానుమనఘ.

మృదు మధుర సుధారసపూరితంబులై హృదయశ్రవణంబులకానందమొదవించు తమపల్కులు నేడేలనో చిత్తవైకల్యస్థానమలంకరింపుచున్నవి!

గీ. అదరుచున్నది కుడికన్ను ✽ హృదయమందు
భయ విషాదంబు లెంతయు ✽ ప్రబలుచుండె
గుండెలవిసెడు మాటాడ ✽ గోర్కెతగ్గు
చుండె నిదియేమి హేతువో ✽ యుర్వినాథ!

నేటికి మాసద్వయమునుండి నిద్రాహారములులేక దుర్భర పరితాపంబునదూలుచు దేహ మస్వస్థతగానుండు తామా ఘోరవిపినాంతరంబుల కేగుటకు నాయంతరాత్మ సమ్మతింపకున్నది.

ధ్రువ :—ప్రేయసీ! నీవిట్లనంగీకారము సూచించుట స్త్రీ స్వభావ సిద్ధమే! ప్రజాపరిపాలనా బద్ధకంకణ ధౌరేయుండనగు నాయడుగులఁబడి మొరలిడు కర్షకులరక్షింపకుండుట రాజధర్మమగునా! ఇన్నియేల!

ఉ. పౌరులకాపదల్గలుగ ✽ పార్థివుఁడారసి దీర్పకున్నచో
భూరియశంబు సంపదప్ర ✽ భుత్వము సర్వము తల్లక్రిందుగా

మాఱును నాన దుఃఖ మవ శ్రీ మానము దేహవిసర్జనంబుఁ జే
కూఱును ధారుణీశులకు శ్రీ కూడదు పౌరవిగర్హనర్తనల్.

లీలా :—ఆర్యపుత్రా ! బలవంతులగు దండనాయకాది సకలసైన్యము లుండ అప్రతిహత పరాక్రమసంపన్నులగు ధీమంత ప్రభృతి యమాత్య సామంతులుండ మృగసంహారమునకు స్వయముగా మీరేల శ్రమజెందవలయును ?

ధ్రువ :—ఎవ్వరున్న నేమిలాభము? 'రాజులేనికయ్యము సాగదను' సామెత వినలేదా ?

మనో :—ఏలినవారి కెదురాడలేము క్షమింపవలయును.

ధ్రువ :—మనోరమా ! నీవు నీసౌధమున కరుగుము.

మనో :—మహాప్రసాదము ! (నిష్క్రమించును)

ధ్రువ :—లీలా ! నీతో రహస్యమొకటి చెప్పవలసియున్నది.

లీలా :—ప్రభువర్యుల కటాక్షమునకు సర్వదా పాత్రురాలను.

ధ్రువ :—కులగౌరవదూరుడై వర్తించు మనకుమారుని దుండగము లించుక విమర్శింపవలసియున్నది.

లీలా :—(ఆశ్చర్యముగ) ఆ! ఏమది ?

ధ్రువ :—ఏమిజరుగవలయునో ఆదే జరుగుచున్నది షోడశవర్షప్రాయ మంకురించి నప్పటినుండి దుర్జనసహవాస మవలంబించి ధర్మాధర్మశూన్యుడై రాజపుత్రుండనని విఱ్ఱవీగుచు కన్నుమిన్నెఱుంగని గర్వాతిరేకంబున పురజనుల నెందఱెందఱినో బాధించుటకు తంత్రము లెన్నియో పన్నుచు నానిర్మల కీర్తికిఁ భంగము కలిగించుట నా సమక్షమున భయభక్తి విశ్వాసములు జూపుచు పరోక్షమున జీవితుండనై యుండఁగనే నా సామ్రాజ్యపదవిఁ జేపట్టుటకు దురాలోచనలు చేయుట వానిదుండగము లొకటి రెండని చెప్పుటకు వీలుండునా ? లీలా ! బాగుగా యోచించుకొనుము. సామ దాన భేదంబులచే నింతవరకు మందలించితిని. ఇక దండనోపాయమే కర్తవ్యమగును.

లీలా :—నాథా! ఇదేమి విపరీతము? నాముద్దుబిడ్డడిట్టి దుర్మార్గ కార్యములు చేయునంతటి సమర్థుడగునా? కన్నతండ్రిపై కత్తిఁ బట్టు మందభాగ్యుఁడేలోకమందైన గలడా? లేక లేక కల్గిన నా కొడుకుపైఁగిట్టని పగవాండ్లు కల్పించిన అపరాధములయందలి సత్యాసత్యములు మీరు విమర్శింపక కర్ణశూలములవలె కఠినోక్తు లాడఁ జెల్లునా? (కంటతడిబెట్టును)

ధ్రువ :—బాలా! ఏల యీలీలవాపోయెదవు! కన్నకొడుకని మనము కనికరించి యూరకొన్నను బాధపడు ప్రజలు సహింతురా?

లీలా :—"లోకులో పలుగాకులో యన్నచందమున" నాపసిబిడ్డని యభివృద్ధి సహించని దుర్మార్గులెవ్వరో అచ్చిక మచ్చికలతో నిచ్చకాలు నచ్చజెప్పినంతమాత్రమున ఏపాపమెఱుఁగని నిరప రాధిపై నేరమారోపింతురా? ఔను నాదురదృష్టమునకుఁజింతింప వలయునుగాని పరుల నేమన్ననేమిసార్థకము? (దుఃఖమవలంబించి) సపత్నీగర్హితనగు నాయందు మీకేల యనుగ్రహముండును?

ధ్రువ :—(ఇంచుక కోపమవలంబించి) ఓసీ! ధూర్తవినయా! నీయన వసరప్రసంగంబులింకిచాలింపుము. నీకల్లబొల్లియేడ్పులకు నీతళుకు బెళుకులకు నీచమత్కార కృత్యములకు వశ్యుడనై నీపుత్రుని చెడునడతలుచూచి సహించి సూర్యాన్వయంబునకు తీరనికళం కముఁదూర్తుననుకొంటివా?

లీలా :—(దుఃఖముతో) మాతల్లికొడుకులమూలమున మీరంతటి కష్టమేల పొందవలయును. మీకీర్తికిఁభంగము కలిగింపుచుంటి మని తోచినచో మాయిరువురిని మీఖడ్గమునకు బలిగావించి పట్టమహిషికొడుకునే తలనెక్కించుకొని ఆనందింపకూడదా?

ధ్రువ :—(తీవ్రకోపమున) ఛీ! పనుప్రాయురాల! నోరుమూయుము. కొడుకును మంచి నడవడి నడిపించు బాధ్యురాలవగుటచే తెలిపిన నా పలుకులు కర్ణశూలములాయెనా?

చ. తనయుని దుష్ప్రవర్తనము § తల్లియుఁదండ్రి సహింత్రుగాని భూ
జనములు నీచుఁడీతఁడని § సంతతమున్వచియింపుచుండ నిం
దను భరియింపదుర్ఘటము § దాన యశంబు నశించుగాన మిం
చిన పనికై విచారపడఁ § జెల్లదు సాధ్యముఁగావు కోరికల్.

కుమారుని దుండగములే నామనఃక్లేశమునకు కారణభూత
ములైనవి. వేయుమాటలేల! నీవతనికి తగిన బుద్ధులు గఱపిబుద్ధిమం
తునిగావింపకున్నచో నీనోట వెలువడిన భావిఫలమనుభవింపకతప్పదు
ఇది ముమ్మాటికి నిశ్చయమని దలంపుము. ఇదియే నాచండశాసనము.
జాగ్రత్త! (నిష్క్రమించును.)

లీలా :—(తనలో) అయ్యో దైవమా! ఏమినాప్రారబ్ధము!

గీ. "కంచెయే చేనుమేసిన" § క్రమముగాదె
కన్నపుత్రునిపై తండ్రి § కరుణమాలి
నిందలను మోపి దండింప § నిశ్చయింప
వేఱు దిక్కెవ్వ రుర్విపై § వెతలుఁబాప.

వయసుమీరిన కొలది యీ వృద్ధరాజు మాకెంతటి ద్రోహ
మొనర్చుటకు బాల్గొనుచున్నాడే! (ఆలోచించి) కానిమ్ము! చూచె
దనుగాక! కుమారునకీ వృత్తాంతముచెప్పి సతీ సుతసహితముగా
యీ కపటహృదయునకు తగినశాస్తిగావింపవలయు. (నిష్క్రమించును)

## 4-వ రంగము

(అరణ్యమున ధ్రువ-ధీమంత-పౌరులు-ప్రవేసింతురు.)

మొ॥పౌ :—ఒరేశినోడ! మనయెంకన్నగాడే కొద్దో గొప్పో సదువు
కొన్నాడు బాబయ్యగారితో ఆణ్ణిమాట్లాడనీయండిరా! సంగతు
లన్ని సక్కగా మనవి శేత్తాడు.

రెం॥పౌ :—హాఁడు శెప్తానంటె వద్దంటామ్రటా?

మూ॥పౌ :—మంచిది మీరుమాట్లాడకండి (ధ్రువసింధునిసమీపించి)
ప్రభూ! ఈయడవి సంచరించు మృగసంచార మెఱుంగవేడెద,

సీ. ఇవి సింహరాజంబు | లవలీల కరికుంభ
ముల జీల్చి జెండాడు | భూములయ్యె
ఇవి పెద్దపులులెల్ల | దవిలి మాపశువుల
నిల్గింపఁ జేసిన | నెలవులయ్యె
ఇవి గాంచఁదోడేలు | లెద భీతిలేకను
చంపి మేకల నీడ్చు | జాడలయ్యె
ఇవి క్రూరజంతువు | లేకమై యురుదెంచి
మావాండ్ర బొజిగొన్న | తావులయ్యె.

గీ. ఇవియె భల్లూక తతులకు | నిరవులయ్యె
ఇవియె జంబుక హరిణ గం | ధేభ మహిష
గండ భేరుండ శరభ | ఖడ్గ తతులు
జొచ్చి పైరులుచెడగొట్టు | చోటులయ్యె.

ధ్రువ :—(నలుదిశలుపరికించి) ఈస్థలములు మిగుల భయంకరములై దుష్టమృగంబుల కాలవాలమై చూపరులగుండెలవియ జేయుచున్న వనుటలో సందేహములేదు పౌరులారా! మీరింక నిర్భయముగా సంచరించునట్లు ఈదుష్టసత్త్వంబుల నిరవశేషంబుగాఁ బరిమార్చి మీరాయిక్కట్టుల జక్కబెట్టెద! (చేయివీచిప్రకాశముగ) నిరంతర రాజకార్యనిర్వాహకులగు సైనికులారా! లెండు! త్వరపడుడు ఆలసింపకుడు! వేటకాండ్రఁ బురికొల్పుడు.

ఉ. "అల్లదె! క్రూరజంతువు ల | హంకృతితోనిటు వచ్చుచుండె భీ
తిల్లకనొక్కపెట్టున" వ | ధింపుడు వానిని కూరకోతగా
తల్లడమందు పౌరులు ము | దంబునఁ జెందగ రాజభక్తి సం
ధిల్లగ మన్ననల్ వడయ | ధీరతఁజూపుడు సత్వరంబుగన్.

(ఆతురతతో) అదిగో, భూమ్యాకాశంబులు బ్రద్దలగునట్లు భయంకరార్భాటంబులతో తమతమ నివాసంబులు విడచి ప్రళయ క్రోధాతిరేకంబున నలుదిశలఁగ్రమ్ముకొనుచున్నవి ఆలసించిన కార్యహాని వాటిల్లును.

భటులు :—చిత్తము! ఏలినవారి ఆజ్ఞ నిర్వర్తించెదము!

(మృగములజోపుచు భటులు నిష్క్రమింతురు)

ధీమం :—మృగయావినోదలంపటులగు మహారాజుగారి ముఖకమలము నేడెంతయు సంతోషావృతమై కనుపడుచున్నదనుటలో సందేహము లేదు.

ధ్రువ :—అమాత్యపుంగవా! ప్రజలసౌకర్యమునకు పాటుపడుటయే కదా రాజధర్మము. (ముందుకు పరికించి) ధీమంతా! అదిగో నాక్రేవనించుక పరిశీలింపుము. విశాలమగు నా పొదమాటుగొని మృగరాజమొకటి తన తీక్ష్ణదంష్ట్రల నాపై నిగుడింపుచు వాలవిక్షేపమొనరించుచున్నది.

ధీమం :—ఔను! సేనాకంఠీరవమును సంహరించి వచ్చువరకు తామిా వృక్షచ్ఛాయల విశ్రమించి శ్రమనివారింపుకొనుడు.

ధ్రువ :—త్వరలో సిద్ధపడివత్తును. లేకున్న ప్రమాదము కల్గును.

ధీమం :—మహాప్రసాదము (బాణము సంధించి నిష్క్రమించును)

ధ్రువ :—(ముందుకు పరికించి) ఓహో! ధీమంతుని దెబ్బ తప్పిపోవుటచే కాబోలు కేసరీంద్రము గర్జింపుచు మదగజంబులపైకి లంఘించు నట్లు పొదనుండి వెలువడి నా దెసకురుదెంచుచున్నట్లున్నది. (ఆలోచించి) రానిమ్ము! మదీయఖడ్గధారచే ఖండఖండములుగా జెండాడెదగాక.

(కత్తిపట్టి పైబడుసింహముతో పోరాడుచుండును)

(ధీమంతుడు మరియొకదిశనుండి ప్రవేశింపుచు) ఆహా! బహువిచిత్రముగానున్నది. కన్నుమూసి తెరచునంతలో మృగేంద్రము నా వ్రేటు తప్పించుకొని కంటికి గానరాకుండ తప్పించుకొన్నదే! (ముందుకునడిచి) ఈమరుగునం దెచ్చటనైన డాగియుండునా? (నలుదిశలుచూచి) అయ్యో మోసము; ఆదుష్టమృగము రాజ సింహునిపై బడి తన వాడినఖములతో శరీరమంతయుం గడికండలుగాం జీల్చుచు సార్వభౌముని ఖడ్గమున కెఱగాకుండ తప్పించుకొనుచున్నదే!

గీ॥ అమరఁ బెదురును లేక పంచాననంబు
గజములఁ గూల్చి లంఘించు కరణి, నేడు
భూతలేంద్రునిపైఁ బడి భూరి రోష
మున వ్రణాంగుని జేయుగా దనరె నకట

నరేంద్రుని నిశితకరవాలధారచే హర్యక్షంబు ధరాతలంబునఁ గూలుచున్నది. దానితోపాటు ప్రభువర్యులుకూడా రక్తసిక్తాంగులై తూలుచున్నారే?

(తెరలో) ధీమంతా! బాధ; సహింపదుర్భరము! దుర్భరము!!

(రక్తసిక్తాంగుఁడై తూలిపడు రాజును చేరి ధీమంతుఁడు పట్టుకొనును)

ధ్రువ :—హా! బాధ! భరింపజాల! భరింపజాల!! (తూలును)

ధీమం :—(రాజును కూర్చుండబెట్టుకొని గాయముల రక్తము తుడుచును.

ధ్రువ :—హా! మంట! మంట! నాదేహ మగ్నిలో పొర్లించినట్లున్నది దుర్భరమైన బాధ సహింపసాధ్యముగాదు. ప్రాణవాయువులు కంఠగతమై నాల్కతడి యారిపోవుచున్నది. దాహము! దాహము!! (స్పృహతప్పిపడిపోవును.)

ధీమం :—(తనలో) ప్రమాదము శరీరమంతయు కడికండలుగాఁ జీల్చబడియున్నది. పూసిన మోదుగుచెట్టువలె సర్వాంగములనుండి రక్తము ధారాపాతముగా స్రవించుటచే కాబోలు. వ్రణబాధకు నోట తడియెండిపోయి దేహస్మృతిదప్పిన యీ రాజచంద్రునకు దాహోపశాంతి గావింపవలయును. (నిష్క్రమించి తిరిగి జలముతో ప్రవేశించును)

ధ్రువ :—(కనులు తెఱచి) దాహము! దాహము!!

ధీమం :—సార్వభౌమా! ఇదిగో! ఈ నిర్మలోదకమును గ్రోలి కొంచెము విశ్రాంతిపొందిన శ్రమనివారించును. (ధ్రువసింధుని లేవనెత్తి నీరు త్రాగించును.)

ధ్రువ :— (ధీమంతునిజూచి) నాయనా ధీమంతా! సింహముచే శరీర మంతయు జీల్చబడి కండలు వ్రేలాడుటయేగాదు. ధారాపాతముగా రుధిరము స్రవింపుచు క్షణక్షణమునకు స్పృహాతప్పుచున్నది. నా కంటికి నలుదిశలంధకారబంధురముగా నున్నవి. మిన్నువిఱిగి మీద పడినట్లు శిరోభారముకలుగుచున్నది. హా! జీవింపజాల! జీవింపజాల!! (కండ్లు తేలగిలవైచి పడిపోవును)

ధీమం :—మహాప్రభూ! ధైర్యమవలంబింపుము. ఈశ్వర సంకల్ప మనుల్లంఘనీయము. మిమ్ము నిరాయాసముగా పురంబుజేర్చి వ్రణ వైద్యులచే తగు చికిత్స చేయించెదను.

ధ్రువ :—(ఇంచుక కదలి) హా! బాధ! బాధ!! కాలవిరామము ప్రాణాపాయమగును.

ధీమం :—ఏలినవారిని త్వరలో నగరమునకు ప్రవేశింపజేసెద సంశ యింపకుడు.

ధ్రువ :—అమాత్యపుంగవా! మన పరివారమును త్వరపెట్టుము. అబ్బా! శ్రమదుర్ఘటముగా నున్నది.

ధీమం :—రాజేంద్రా! నా చేయూతగొని మెల్లగాలెండు. (ధ్రువసిం ధుని రథముపై పరుండబెట్టుకొని, సైనికుల బిలుచుచు నిష్క్ర మించును.)

5-వ రంగము

(సౌధమున శత్రుజిత్తు ప్రవేశించును.)

శత్రు :—(తండ్రిని ఉద్దేశించి) ఓయీ వృద్ధరాజా! కన్నకొడుకు లిరు వురిలో పక్షపాతబుద్ధి నవలంబించి చరించు నీకుటిలప్రేమ నీదురా లోచనము నీదురన్యాయము లోకమెఱుంగదని మునుముందే లేని నేరముల నారోపించి పదుగురిలో పరాభవించుట చాలకనా! మాయలమారియగు పట్టమహిషిని చూచుకొని సుగుణరాశియగు మాయమ్మను దురభిమానివై నోటికొలది దూషించితివిగా!

(క్రోధమున కనుబొమ్మలు ముడివైచి) ఛీ ఛీ గోముఖవ్యాఘ్రమా! నీకపట మిప్పటికి తెల్లమైనది నేడు! క్షత్రియ శ్రేష్ఠ పరిహాసపరాక్రమహీనుండనై నాయుధములు చేపట్టక నీకు నీయనుచరులకు నివలపుత్రుల వలె మోకరించి చేతులు జోడించి తొత్తు క్రింది పడదొత్తువలె జీవింతునని తలంచితివా? దుష్టుడా!

మ. తలయున్ గడ్డము నరసిపోయినను యుక్తజ్ఞాన హీనుండవై
ఖలు డామంత్రి హితోపదేశమతి ముఖ్యంబంచు భావించి నిం
దలు నాయందు స్థిరీకరించి కుటిలాత్మా నన్ను శిక్షించు నీ
తలపుల్ సాగవు నేటినుండి వ్యక్తిక్రైస్తంబౌను నీకెవ్వరున్.

కన్నతండ్రివని ఇంతవరకు నీయందెట్టి భయభక్తి గౌరవ ప్రేమలచేత వర్తించితినో ప్రస్తుతమంతకన్న పదిరెట్లు పగసాధింపవలసి వచ్చినది. నీవే కొడుకు సుగుణఖనియు నీతికోవిదుండని సర్వజనగౌరవార్హుడని నిఖిల సామ్రాజ్యపదవి నలంకరింపసమర్థుడని భావింపుచుంటివో ఆకొడుకునకీ ప్రపంచమున శతాయుర్దాయము నిండినదనియే దలంపుము. (ఆలోచన వహించి) వయసుమీరుటచే బుద్ధి పెడతలంబట్టి నన్ను పలుగురిలో చులకనగా పలికిన ఆకలుషఫలమేనాటికైన యనుభవింపకుందువా? నాహృదయఫలకమును శకలపఱచిన నీ ప్రభుత్వమింక నిరాతంకముగా కొనసాగదని దలంపుము. (ఇంచుక యోచించి) నేటినుండి రాష్ట్రమంత నల్లకల్లోలపఱచిన నన్నెవ రేమిసేయుదురో చూచెదగాక! తండ్రియట! తండ్రి నిర్నిమిత్తముగా కన్నకొడుకును దండించనెంచువాడా తండ్రి! మంచిది కానిమ్ము! ఘోరపరాభవమునకు ప్రతీకారము సలుపుటయే వీరపురుషలక్షణము. (నిష్క్రమించుచు)

ప్రథమాంకము - సమాప్తము.

ఓమ్.




## ద్వితీయాంకము

### 1–వ రంగము

(రాజభవనమందు శయ్యపై ఆయాసముతో ధ్రువసింహుడు ఉపచరిస్తూ ధీమంతుడు మనోరమ లీలావతి శత్రుజిత్తు సుదర్శనుడు ప్రవేశింతురు.)

ధీమం :—మహాప్రభూ! తమ వ్రణబాధ తగ్గుచున్నను నెలదినముల నుండి శరీరమంత కంతకు కృశింపజేయుచు అన్నపానవర్జితులై ప్రబలజ్వరపీడితులై యుంటిరి. వేలకొలది దివ్యౌషధము లొసంగినను సుగుణము గనుపించుటలేదు. దేవరవారి మనస్తాపమే ఇట్టి దురవస్థకు మార్గదర్శియగుచున్నది.

గీ. ప్రళయదావాగ్ని శిఖలలోఁ బడినవాడు
ఎపుడు నశియించునోగాని యెంచిచూడ
చింత మదియందుస్థిరముగా జేరియున్న
ప్రతినిమేషము దహియించు పార్థివేంద్ర!

ధ్రువ :—(ఆయాసముతో) ఉస్సు అబ్బా! బాధమించి పోవుచున్నది రోగమునకు మందున్నదిగాని మనోవ్యాధికి మందుండునా! (కండ్లుమూయును)

ధీమం :—(రాజు చెయ్యిచూచి) ఇంకేమున్నది. కరపాదశైత్య మావరింపుచున్నది. (ప్రకాశముగ) కుమారసింహులారా! వెలుపలకు

పొందు మీరిందుండవలదు. పసివాండ్రు మీరి బాధచూచి సహింపలేరు.

శత్రుజిత్తు-సుదర్శనుడు :—మంచిది. (నిష్క్రమింతురు)

ధ్రువ :—(కండ్లు తెరచి) కొడుకు దుర్నడవడియా! వంశకళంకము.

ధీమం :—సార్వభౌమా! తమరావిచారమును పొందవలదు. కాల విపరీతమున సంభవించు దుర్యశము శాశ్వతముగా నుండబోదు. మీరస్వస్థులై యుండుటవలన శత్రుజిత్తు తనస్వేచ్ఛానుసారముగా వర్తింపుచు పురజనుల బాధించుట నేనుగుర్తించి భయపడుచితిని. యువరాజులంగారాబాలుని దుస్తంత్రములు తలంపవలదు; ఆ విచారభారము తొలగింపకున్న ప్రాణాపాయముకలుగకమానదు మీశరీరస్వాస్త్యము కలిగినట్లు వత్సరాజునకు తగుశిక్షవిధింప వచ్చును. ఇంచుక శాంతింపుడు.

ధ్రువ :—నిశ్చలధైర్యము వహించుటయా! కల్ల! కల్ల!!

మనో :—జీవితేశ్వరా; తెలిసి తెలియకచేసెడు పసిపాపని దుష్కృత్యములకు జెంగపెట్టుకొని ప్రాణగొడ్డంటమగు నపాయము కలిగించు కొనుటయా?

ధీమం :—(రాజుశరీరము నిమిరిచూచి తనలో) హా! దైవవిధి నేమన వలయును నృపాలునకు కరపాదశైత్యములతో పాటు ధాతుక్షీణమై మరణచిహ్నములు పొడగట్టుచున్నవే? ఇంకెవ్వరుదిక్కు? మాతాపితృవియోగమునకలుగు కొఱతలేకుండ బాల్యమునుండి సాకి పెద్దవానిగావించి నన్నగ్రస్థానమలంకరింపజేసి కన్నబిడ్డల కన్న మక్కువతో రక్షించిన పితృసమానుడగు ఈధర్మప్రభుని ఇంకేవిధముగా బ్రతికించుకొందును? మందభాగ్యుండనగు నాకింకెవ్వరు రక్షకులు (దుఃఖముతో) భూపురందరా! నీప్రియభృత్యుని యొక్క మారుచూచి మాట్లాడవా? నీయమాత్యునకేది తెఱవు?

ధ్రువ :—(ఇంచుకకదలి) నాసర్వాంగములు సంచలింపుచున్నవి నాకన్నులకు భూమ్యాకాశములు చతుర్దిక్కులు కుమ్మరసానవలె

గిఱగిఱ దిరుగుచున్నవి. నాతలలో నేవియో భూతములు పోరాడుచున్నవి నాకనులకు నలుదిశలంధకార బంధురముగా నిర్మలజ్యోతి నశించినది ప్రళయమేఘపంక్తులరీతి యుగాంత ఝంఝానిలంబు చందంబున ప్రాణవాయువులు తల్లడపడుచు కొట్టుకొనుచు కంఠగతమైనవి ఉస్సురబ్బా; బాధ భరింప దుర్భేద్యము కాలముసమీపించినది జీవములుండుట కల్ల! కల్ల!!

ధీమం :—సర్వమెరింగిన ధీశాలురు తామేయిట్లు విషాదవాక్యములాడిన మాదృశుల మనోవృత్తులు స్థిరపరచువారెవ్వరు మహాప్రభూ! భయపడకుడు భగవంతుని యనుగ్రహమున త్వరలో ఆరోగ్యవంతు లగుదురుగాక!

మనో :—నాథా! హృదయ దౌర్బల్యముచే నిట్టిముప్పు ఘటిల్లుచున్నది ఆర్యపుత్రులకచిరకాలమందే దేహ స్వాస్థ్యమగును.

ధ్రువ :—ఆ ! జీవితాశయా ? నిష్ఫలము ! నిష్ఫలము !! ధీమంతా !

ధీమం :—ప్రభూ ! ఏమిసెలవు ?

ధ్రువ :—నాతుదికోరిక యొకటివినుము దుర్గుణ దుర్మార్గకార్యాచరణ దురాలోచనా పారంగతుండగు శత్రుజిత్తు కృత్యంబులు జాగరూకుడవై గ్రహించి శిక్షింపుము వంశోద్ధారకుడు సుదర్శనుడు నిఖిలరాజ్య భారావహునిగావించి ప్రజలకన్న బిడ్డలవలె రక్షించుట కర్తవ్యము. వంశకళంకము రూపుమాపుటకు ప్రయత్నింపుము. నాకాయువు సరిపోయినది. (లేవబోయి తూలిపడుచు) అదిగో ఆకాశమున ముక్తికాంత శాబోలు నన్నాహ్వానింపుచున్నది. హా ! దీనబంధూ ! పాహిమాం ! పాహిమాం !! (కండ్లు తేలగిలవైచి పడిపోవును)

ధీమం, మనో, లీలా } హా ! హాతవిధీ ! (అందరు దుఃఖమభినయింతురు)

(తెరజారును)

## 2-వ రంగము

(రహస్యమందిరమున విచారములో లీలావతి శత్రుజిత్తు వీరిని ఓదార్చుచు యుధాజిత్తు ప్రవేశింతురు.)

యుధా :—వత్సా ! కాలపరిమాణానుసారముగా దివమలంకరించిన వారికై విలపించిన ఫలములేదు. ధీరహృదయులు సర్వకాలములందు సుఖదుఃఖములు మానావమానములు కలిమిలేములు సమానములని భావింతురు. దేహములు జలబుద్బుదములని గుర్తింపవలయును. సహజముగ ప్రతిజీవి దుఃఖమనుభవింపక తీరినదికాదు.

మ. జననంబెప్పుడో యప్పుడేమరణముఁ గ్రక్కొంపనై యుండెఁ గా
వున దేహంబు లనిత్యముల్ స్థిరములే ! భూమి న్విచారంబు మా
ని, నిరుత్సాహము ద్రోసిపుచ్చి ప్రజ మన్నింపంగ సామ్రాజ్యల
క్ష్మినిఁ జేపట్టి సుఖంపుమింక నృపతుల్ సేవింప సామ్రాట్టువై.

లీలా :—కుమారా ! నీతాతగారి మనోభిప్రాయమనుసరించి నీపరాభవాగ్నినిఁ జల్లార్చుకొనుము.

శత్రు :—మాతామహా ! నిస్సహాయుఁడనగు నాకా మహోన్నతపదవిసిద్ధించునా ? ఎన్నటికైన నాపరితాపభారముతొలఁగిపోవునా ?

లీలా :—అదేమినాయనా ! అట్లనుచుంటివి ? సకలరాజకోటికి ప్రక్కబల్లెమగుచు జగదేకశూరుండగు, నీమాతామహుండు నీదండ కాపాడుచుండ నీకేవిచారముండునురా తండ్రీ !

యుధా :—ఆయుష్మంతుడా ! సర్వసమర్థుడవైన నికింక మనస్తాపమేమున్నది ?

శత్రు :—తాతా ! నావిచారమెరుంగకుండుటచే నిట్లాడుచుంటివి. లేకున్ననా !

యుధా :—వత్సరాజా ! నీమనఃక్లేశము సర్వము నాకెరిగింపుము. సఫలీకృత మనోరథుని గావించెద ! వేయేల ! నా రథ గజ తురగ

పదాతి చతురంగ బలములు నాధనాగారము నీయధీనము. తుదకు నా ప్రాణము లైనను నీకొఱకు ధారవోయుటకు సంసిద్ధుడనై యుంటిని నీక్షేమమే నాక్షేమము నీసౌఖ్యమే నాసౌఖ్యము! నిస్సందేహముగా నీయభిప్రాయమును వెల్లడింపుము.

శత్రు :—సందేహ మేమియు లేదు కనిపెంచి పెద్దగావించిన తండ్రి దుర్మరణమున కంతగాచింతింపను ధన కనక వస్తు వాహన భోగ భాగ్యముల నింకనైన వాంఛింపను కాని అహర్నిశములయందు నాహృదయ మండేదియో బలవత్తరమగు విషయము కఱకు అంపమువలె గోయుచున్నది.

యుధా :—కుమారా! నీవెట్టి పరితాపమును పొందవలదు! నిజమెఱింగింతువేని నీసంకల్ప మనాయాసముగా నిముష మాత్రమున నెరవేర్చుటకు సిద్ధముగానుంటిని.

శత్రు :—నాక్షేమమునకు పాటుబడు మీకు తెల్పని రహస్య మేదియు లేదు సావధానముగానాకర్ణించి ప్రస్తుతాచరణీయమేదో విధింపుడు?

ఉ. జిత్తులమారిమంత్రి నను ♦ జేర్చుడు పట్టపుదేవి పుత్రుడే
యుత్తము డాతడే ధరణి ♦ కొప్పిన యేలికటంచు సభ్యులు
న్మత్తులుగాన వారలకు ♦ నచ్చగ జెప్పుచునుండుమాట నా
చిత్తము దత్తరిల్లునటుఁ ♦ జేయుఁదొడంగెను కత్తికోతగన్.

తాతా! ఇంతటితో తీరిపోవుటలేదు కదా?

సీ. సవతియాజ్ఞల శిర ♦ సావహింపుచుఁతల్లి
పడరాని బాధలఁ ♦ గుడువ వలయు
పాలివాడుర్విని ♦ బాలింప ప్రజలతో
నాదరత్వము లేక ♦ నలరవలయు
వయసునబెద్దనై ♦ పసివానిశాసన
మున కంజలినిఁబట్టి ♦ పొగడవలయు
జ్ఞాతికి మంత్రికి ♦ సరిలేక యొకమూల
నీచాతి నీచతనిన్నిలువవలయు

గీ. తొొత్తు బడదొత్తువలె వారి చిత్తములకు
మచ్చికను గొల్వందగురీతి మసలవలయు
స్వేచ్ఛవిడనాడి సతము జీవింపవలయు
ఇంతకంటెను హీన మింకేది? తాత!

అభిమానధనుండనై భుజబలప్రతాప శౌర్యములచే జీవింప తగిన నేను హేయకార్యములకు తలవంచి హీనాతిహీనుని మాడ్కి అపౌరుషేయముగా అనామధేయునిగా అసమర్థునిగా బ్రతికియుండుట కంటె బలవన్మరణమున కంగీకరించుట శ్రేయోదాయకము కాదా?

చ. పరువు ప్రతిష్ఠలన్ విడచి పౌరజనంబుల నీసడింపుకున్
గుఱియగుచున్ సదా మదిని గుందుచునుండుటకంటె వీరుడే
తెఱగున నైన రాజ్యమును దృప్తిగనేలుటొ; లేక సాగరాం
తరమున గూలిచచ్చుటొ? మువదంబగు లోకులకెల్లచూడగన్.

తాతా? పెక్కుమాటలేల?

సీ. పాలివాడూరిలో పలజేరిన జాలు
వేఱుగా నగ్నిని వెదకనేల?
దాయాది తనయింట బాయకుండిననజాలు
ప్రక్కలోపల పాము పండనేల?
సమభాగి గృహమున సాపడినంజాలు
కాలకూటవిషంబు గ్రోలనేల?
వంశీకుడగు వాని పంచనుండినంజాలుం
బల్లెంబులన్ గ్రుమ్మ బడుటయేల?

గీ. ఇన్నిటికి మించియున్నదే మన్నవినుము
జ్ఞాతికంటికి నొకసారి గానుపింప
ప్రాణ మానార్థ యశములు పాడుపఱచి
నిలువు నీఱుగ గూల్చెడు నిజముతాత.

యుధా:—(నవ్వుచు) ఓహో! ఇదియా నీపరితాపకారణము? ఇం మాత్రమునకే నీయంతవాడు విచారింపజెల్లునా?

శత్రు :—మాతామహా! పరితపింపక నేనుచేయునదేమున్నది?

యుధా :—తల్లి కొడుకులతోపాటు ధీమంతుని మోసగించి రాజ్య లక్ష్మిని స్వీకరింపకూడదా?

చ. నరపతులెల్ల నీదుచరణంబులపై బడి నమ్రభావులై
కరములుమోడ్చి కప్పములు గట్టుచు నీకనుసన్నలన్ సదా
దిరుగరె? సార్వభౌమ పదదీప్తిని దేలఁగ పట్టభద్రుడున్
జరిపెద నేడె నిన్ను రిపుసంఘములుర్వినిదల్లడిల్లగన్.

శత్రు :—ఆ మహాభాగ్యము లభించుట సామాన్యమా?

యుధా :—సామాన్యముగాకేమున్నది నాయనుచరుల సహాయంబున నిద్రావశ్యుండగు సుదర్శనుని బట్టించి క్రూరమృగదుర్గమారణ్య సీమను తలనఱికించెద ఒంటరిపాటున ధీమంతుని బంధించి చెరసాలయందుంచి శత్రునిష్కంటకముగా ఈసకలసామ్రాజ్యము నేకచ్ఛత్రముగా బరిపాలింపుము పుత్రవియోగజనిత భగ్నమనోరథయై మనోరమ మరణించును ఒకవేళ పట్టమహిషి మృత్యుకరాళంబునకు జిక్కకున్నను నీకలవడు ప్రమాదమేదియు లేదు!

శత్రు :—(యుధాజిత్తుని కౌగలించి సంతోషమున) మేలు! మేలు! నేటికి నేనెంతయు సఫలమనోరథ మవలంబింపగల్గితిని తాతా; ఇప్పటికి నాకోరిక ఫలించినదని గర్వింపవలసియున్నది నేన్ప్రపంచమున ధన్యులలో ధన్యుడనైతిని.

యుధా :—ఆహా! నిస్సందేహముగా.

శత్రు :—ఈకార్యము నెరవేర్చుటకు సర్వకార్యము లందారితేరి, నిపుణులై రాజవిశ్వాసజ్ఞులైనవారిని నియమించుట ముఖ్యమని నా అభిప్రాయము!

యుధా :—ఆయుష్మంతుడా! నీకాసందేహమవసరము లేదు నాయందు భయ భక్తి విశ్వాసములు కలుగు కాలనేమియను కిరాతనాయకుండుగలడు ఆతడన్నివిధముల సమర్థుడనటంలో సంశయములేదు!

నిశ్చయముగా నతడే తలంచిచో ఈ ప్రపంచమంతయు తల్లక్రిందులు జేయదగిన మహామాయావి.

శత్రు :—(సంతోషముస) మహాత్మా! అట్లైన మనమింకాలసింప రాదు త్వరలో కార్యభరము ముగింపవలయును.

యుధా :—చిరంజీవీ! మనసంకల్పము నేడేజరిపించెద! నావెనువెంట రమ్ము! (శత్రుజిత్తునితో యుధాజిత్తునిష్క్రమించును.)

లీలా :—(స్వ) నాతండ్రి మనస్ఫూర్తిగాతలంచెనేని మూడులోకముల వారిని ముక్కుతిప్పలబెట్టి మూడుచెఱువుల నీరుత్రాగించగల సమర్థుడు. (ఆలోచించి) ఆహా! ఇప్పటికి నేనుసపత్నీ గర్వితావమానము బాయగల్గితిని. నాకొమరుడు, పట్టభద్రుడైన మీదటగాని మనోరమ గర్వప్రాయశ్చిత్తమొనర్తునుగాక (నిష్క్రమించును.)

## 3 వ రంగము

(సరయూనదీతీరమున ధీమంతుడు ప్రవేశించును)

ధీమం :—(తనలో) ఆహా! ప్రపంచమెంతలోయెట్లుమారినదే? తన రాష్ట్రమందలి ప్రజలనుకన్నబిడ్డలవలెపోషింపుచు వారికెట్టిబాధలు కల్గకుండ యనుక్షణంబులందు విచక్షణతో రక్షించుసార్వభౌముడు స్వర్గమలంకరించినంత మాత్రంబున గృహకల్లోలములతోపాటు ప్రజాందోళనములు దినదినాభివృద్ధియగుచున్నవే? దీనికంతయు శత్రుజిత్తేకారణభూతుడుగదా? (ఆలోచించి) ఔను ఆదుర్మార్గుని దుర్నడతలే రాజేంద్రునిమరణమునకు హేతువులయ్యెను. మనోవ్యాధినిమించినరోగము ప్రపంచమునలేదు (పాపీచిరాయు స్సుకృతీ గతాయువన్నట్లు) అచిరకాలమందే ఆ ధర్మమూర్తికి మరణము వాటిల్లవలయునా! పరమదుర్మార్గుడగుశత్రుజిత్తును మున్ముందే శిక్షింప సమ్మతింపకుండుటచేతనేకదా ఇట్టిదుస్థితి సంభవించినది.

ఉ. ప్రాణసమానుడౌ నృపతి స్వర్గపురంబునలంకరించె వి
జ్ఞాని సుదర్శనాహ్వయుడు సోమ్రతలమేలగ నోగ్యుడైన ప్రా

యానచుబిన్న శత్రుజిత్తు కడారయ దుర్గుణరాశియాట భూ
జాని యభీష్టమేవిధిని కసల్పగలాడనొ? యింకమీాదటన్.

బాల్యప్రభృతిలెక్కలేని దుష్కార్యము లాచరించుచు తుంటరులగూడి ధర్మాధర్మములుగుర్తింపక స్త్రీ బాల వృద్ధులగు పౌరులబాధింపుచు తుదకు తండ్రిప్రాణములమీాదికి దెచ్చిన దయాహీనుడగు శత్రుజిత్తునకాధిపత్యము నొసంగుటయా? పసివాడైనను సకల సద్గుణసంపన్నుడై ప్రజానురంజకుడై అనుపమాన తేజోవిరాజితుడైన సుదర్శనునకు పట్టాభిషేకమాచరించుటయా? ముఖ్యాంశ మేదియో స్ఫురింపకున్న దే? (ఆలోచనవహించి) శత్రుజిత్తునకు రాజ్యమప్పగించుట, లేగదూడలనుపెద్దపులినోటికందిచ్చినట్లే జనక్షోభమువాటిల్లక తప్పదు. కానిమ్మెదెట్లైనను సుదర్శనుని మూర్ధాభిషిక్తుని జేసి దివ మలంకరించిన మహారాజుగారి మనశ్శాంతిగావింపవలయును. (ఆకాశముచూచి) ఓహో! సూర్యభగవానుడప్పుడే పూర్వాద్రిశిఖరమధిరోహింపుచున్నట్లున్నది! త్వరలోకాల్యకృత్యములనెరవేర్పవలయును.

(నదిలో స్నానమొనర్చి సూర్యున కర్ఘ్యమిచ్చుచుండును)

(మరియొకదిశనుండి ఇరువురు భటులతో శత్రుజిత్తు ప్రవేశించును.)

శత్రు :—(స్వగతము) సంతోషము! సంతోషము!! నాసంకల్పమునకు విఘాతముండునా? సుదర్శనుడీపాటికి అరణ్యమున నా యనుచరునిచే ఖండింపబడి యమాలయంబున కతిథియగును. భాగ్యమన్న నాదేభాగ్యము. (ధీమంతునిజూచి) ఓహో! "మ్రొక్కబోయిన దేవర యెదురైనదన్నట్లు" ప్రబలవిరోధియగు ఈ దుర్మంత్రికూడా ప్రస్తుతం నాకంటబడినాడు. "వంటయిల్లుచేరిన కుందేటివలె" నాచే పట్టుబడు నీతడెట్లు తప్పించుకొనునో చూతునుగాక! (రహస్యముగ) భటులారా! అదిగో రాజద్రోహి. మీారింకాలసింపక నిర్భయముగా నిస్సందేహముగా బంధింపుడు. పొండు. ఊ.

భటులు :—చిత్తము! ఏలినవారియాజ్ఞ నిర్వర్తించెదము. (ధీమంతుని సమీాపించి పట్టుకొని శృంఖలములచేబంధింతురు.)

ధీమం :—(క్రోధముతో) ఓరీ మదాంధులారా ! మదోన్మత్తులై నన్నా బంధింప సాహసించుట ? మీకనులకు పొఱలు గ్రమ్మినట్లున్నవి. మంచి చెడ్డలు గుర్తింపక నిర్భయముగా సర్వజన శ్లాఘనుండనగు నన్నుపట్టుకొన సాహసించిన ఆ నీచాధము డెవ్వడురా?

భటు :—బాబూ ! మాకేమి తెలియదు. మహారాజుగారి సెలవు ప్రకారము మిమ్ములపట్టుకొని బంధించితిమి.

ధీమ :—ఆ ! మహారాజుగారా ?

భటు :—ఔను.

ధీమం :—నన్ను బద్ధుని జేయ శాసించినవాని జూపుదురా ?

భటు :—దయచేయుడు. (బద్ధుడగు ధీమంతునితో శత్రుజిత్తును సమీపింతురు.)

ధీమం :—ఓయీ ! రాజకుమారా ! నన్ను కారణముగా బంధింప నాజ్ఞాపించిన ఆదుర్జనుడెవ్వడో చెప్పగలుగుదువా !

శత్రు :—(నవ్వుచు) నీవంటి రాజద్రోహులను నీవంటి కుటిలప్రవర్తకులను నీవంటి కపటశీలురను బంధించి శిక్షించి ఈ అయోధ్యానగర సామ్రాజ్యలక్ష్మిని వరింప సాహసించిన సర్వసమర్థుడను నేనే. వింటివా ?

ధీమం :—వత్సరాజా ! నీకీదుర్బుద్ధి తగదు. బాగుగా యోచించుకొనుము.

శత్రు :—ఒక్కమారుగాదు. ముమ్మారులు యోచించితిని.

ధీమం :—నీతండ్రికి నమ్మినబంటునేగాకుండ ప్రాణసమానామాత్యుడను. తత్కారణమున నీకు పూజనీయుండనుగాని శిక్షాపాత్రుడను కాను.

శత్రు :—ఔను! తండ్రిగారికి మిత్రుడవగుటచేతనే నీకీ గౌరవము.

ధీమం :—రాకుమారా ! నిన్న మొన్న కన్నుదెఱచిన నీవా? నన్ను దండించువాడవు ?

శత్రు :—నావిరోధియగువాఁడు తప్పకదండింపబడుననియే దలంపుము.

ధీమం :—ఓయీ! మూర్ఖచిత్తుఁడా! నేనా విరోధిని? పురజనుల బాధించు నీదుర్నడతలకాగ్రహించి నిన్ననేకసారులు వధింపనెంచు సార్వభౌముని శాసనంబులకు సమ్మతింపక పసిబాలుండవని కనికరించి యుఱితప్పించినందులకా నాకీఫలముగూర్చుట? కారణము లేక, మిత్రద్రోహమునకు సాహసించితివిగా, కులకళంకా!

శత్రు :—ఛీ! కుచ్ఛితుఁడా! ఏల్ల వేలెదవు? కారణములెన్ని చూపమందువు?

ధీమం :—దోషముండిన ఎట్టిదండనమునకైన సంశయింపను.

శత్రు :—ఏమిరా! నీనక్కవినయము. నీవుచేసిన తప్పులకంతములేదు. చెప్పెదవినుము.

సీ. నామీఁద కొండెముల్ ౘ భూమీశునకుఁ దెల్పి
యుగ్రునిగావించు ౘ టొక్కతప్పు
భయపడుదనితండ్రి ౘ ప్రాణముల్ విడువేళ
ప్రక్కకుఁబంపుట ౘ యొక్కతప్పు
జనపతిమరణింప ౘ శంకింపకను నన్ను
లెక్కశేయక నుండు ౘ టొక్కతప్పు
పలువురిలోనన్నుఁ ౘ బరిహసించి సుదర్శనుఁ
డుత్తముండనిబల్కు ౘ టొక్కతప్పు

గీ. ఇన్నితప్పులు యిట్లుండ ౘ నిపుడునీవు
పెద్దవానిని విడనాడి ౘ పిన్నయైన
సవతి తల్లి కుమారుని ౘ సార్వభౌమ
పీఠమెక్కింపఁదలఁచుటే ౘ పెద్దతప్పు.

ధీమం :—ఔను! పసివాఁడవు. ప్రపంచజ్ఞానమెఱుఁగనివాఁడవగుటచే నేను చేసిన మహోపకారములన్నియు నపరాధములుగా భావించుచుంటివి. సహజస్వభావ సిద్ధమగు నీకుచ్ఛితబుద్ధి, నాయందు స్థాపించుచుంటివి. వయఃపరిపాకమున నీవు పెద్దవాఁడవైనను

పట్టమహిషిపుత్రుడే రాజ్యాధికారమున కర్హుడగుటక్షత్రియధర్మ నిర్ణయముగాదా? (కోపమవలబించి) ఓరీ ద్విపాదపశువా! బుద్ధి హీనుఁడవై చేయరానిదుష్కార్యము లాచరించి లోకాపవాదము నకు దైవస్వరూపుఁడగు తండ్రిని గుఱిగావించి చేతులారఁ జంపు కొనుట చాలకనా? తదనుచరుల శిక్షింప సాహసించుట!

గీ. కుడిచి కూర్చుండ లేకను ౯ కొఱివితోడ
తలను గోకిన చందాన ౯ తప్పుదలచి
లేనివైరము నాతోడఁ ౯ బూనుకొనిన
నీకు శుభమౌనె? యికమీఁద ౯ నీచహృదయ.

ఊ! బ్రతికియున్నచో ఇందులకుప్రతీకారమనుభవింపకపోవు.

శత్రు :—ఛీ; దురాపశదా! నోరుమూయుము! వృధాకారుల బ్రేలిన నానిశితకరవాల ధారకెఱయౌదువు! (భటులజూచి) ఓరీ సేవకు లారా! ఈగోముఖవ్యాఘ్రమును జన్మాంతమువరకు కారాగార శిక్ష ననుభవింపజేయుఁడు. పొండు.

భటులు :—చిత్తము (ధీమంతుని గెంటుకొనుచు నిష్క్రమింతురు)

శత్రు :—(తనలో సంతోషమున) ఆహా! నేనిప్పటికిగదా కృతార్థుడ నైతిని. శత్రునిష్కంటకుడనై చతుస్సముద్ర ముద్రితంబగుభూవల యంబు, నేకచ్ఛత్రంబుగా బాలింపుచు, నాస్వేచ్ఛకొలది విహ రింతుగాక. (శత్రుంజిత్తు నిష్క్రమించును.)

## 3–వ రంగము

(అరణ్యమున భారద్వాజమహర్షి కౌశికుడు ప్రవేశింతురు)

భా :—కౌశికా! దేవేంద్రుని సత్రియాగమెంత, వినోదముగా నెర వేరినదో చూచితివా?

కౌ :—గురువర్యుల మహదాశీర్వచన ప్రభావము సర్వదా శ్లాఘ నీయము తమయనుగ్రహమున్నంతవరకు దివస్పతియేగాదు సామా

న్యుడు కూడా శత్రుజిత్తువలె నరుచునటులో సందేహ మే మున్నది?

భా :—వత్సా! భగవదారాధనకు వేళయతిక్రమింపకుండ త్వరలో ఆశ్రమమును చేరవలయును. త్వరగా నడువ యత్నింపుము.

కౌ :—మహాప్రసాదము. (ఇరువురు ముందునకు నడుతురు)

(నేపథ్యమున)

శా. నేరంబేమి యెఱుంగనట్టి పసివానిన్నట్టి ఘోరాటవిన్
చేరన్ దెచ్చుట కేమి కారణమొ? నా చిత్తంబు భీతిల్లెడున్
ధీరస్వాంతుడవైన నీవిపుడు ప్రీతిన్నా కెఱింగించి నా
దారిన్జూపగ నీకు మ్రొక్కెదను సత్యస్ఫూర్తిగా వీరుడా!

భా :—(ఆశ్చర్యమున) ఏమిది! నిర్మానుష్యమగు నీఘోరారణ్యమునం దెవ్వడో క్రూరుడు దయాదాక్షిణ్యరహితుడై పసిబిడ్డని హింసింప బూని నట్లా బాలుని యార్తనాదముచే గ్రాహ్యమగుచున్నది. (దివ్యజ్ఞానమున గ్రహించి) పాపము నశించుగాక! నశించుగాక! పరమదుర్మార్గుడగు శత్రుజిత్తు దుస్తంత్రమున సుదర్శనున కట్టి యాపద సంభవించినదే? (ఆలోచించి) కానిమ్ము! కౌశికా! మనమీ పొదచాటున మఱుగుపడి సమయమరసి బాలుని రక్షింప వలయును.

కౌ :—దేశికులయాజ్ఞ సర్వదా కర్తవ్యము.

భా :—రమ్ము. (ఇరువురు పొదచాటున దాగియుందురు)

(సుదర్శనుని పట్టుకొని లాగుచు కాలనేమి ప్రవేశించును)

కాల :—బాలకా! నిన్నను గ్రహింప సమయముగాదు. ఇప్పటికే నూరేండ్లు నిండినవని దలంపుము.

సుద :—అయ్యా! నిరపరాధిని. ప్రపంచజ్ఞానమైన గుర్తింపనేరని పసి బాలుడను. తండ్రిలేని బిడ్డడను. పతివియోగ పరితాపానల పరి తప్తయగు మనోరమకేకైక పుత్రుడను. నిరంతర దాసదాసీజన

సంసేవితానంద శైశవక్రీడావిహారుడను. చంద్రకాంత శిలాలంకృత సౌధాంతర విరాజితపర్యంక సుఖనిద్రాముద్రితుడను. నన్నువిడిచి పెట్టు మహానుభావా! బాలుడబాధసహింపలేక లేగబాసిన గోవు రీతి విలపించుచున్నమాయమ్మను ఓదార్చుకొందును. నాయనా! నీకుసుకృత ముండును. నన్నువంపుము చేరనివ్వుము.

కాల :—ఓయీ వెఱ్ఱివాడా ! నీకు కాపుగానుండు రక్షకభటులకండ్లలో కారముజల్లి సౌధమునుండితప్పించి నిన్నిప్పుడీ యరణ్యమునకుగొని వచ్చుట రక్షించుటకుగాదు. పదునుకత్తిచే కుత్తుక నుత్తరించి నీ మాంసఖండములు కాకిగ్రద్దలకాహార మొసంగుటకని భావింపుము. తెలిసినదా ?

కా :—(రహస్యముగ) గురూత్తమా ! వింటిరా ? పాపమాకుఱ్ఱవాని పల్కులెంతటిరాతిగుండెవానికైన మనసుకరిగింపకమానవు.

ఖా :—ఔను. దుర్మార్గులీమాటలకు జాలివహింపరు.

సుద :—తండ్రీ ! నిర్దోషిని చంపుటయుక్తమా ?

కాల :—యుక్తాయుక్తములతో మాకుపనిలేదు. మాప్రభునకు జన్మ విరోధివగుటచే మాకుకూడ విరోధివైతివి.

ఖార :—కౌశికా! దయాదాక్షిణ్యధర్మగుణరహితులకు పాపభీతికలుగుట యఱుదు. అద్రోహచింతనమే వారిని నశింపజేయును.

సుద :—(ఆతురతతో) ఏమీ ? మీరాజెవ్వరు ? మీరాజునకు నేను ద్రోహమేమిచేసితిని ?

కాల :—ఔను, ముమ్మాటికి.

సుద :—అదెట్లు ?

కాల :—ఎట్లా ! వయోజ్ఞానములందు పెద్దయగు శత్రుజిత్తుండగా ప్రభుత్వపదవికి నీవు పాల్గొనుచుండలేదా ?

సుద :—అయ్యా! నాయందనుగ్రహముంచి యదార్థము వచింపుము. నాసోదరుడు నీకు రాజెట్లగును !

కాల :—యుధాజిత్తు మహారాజునకు నేను నమ్మినబంటును. ఆభూపాలుని పౌత్రుడు నాకధిపతియేల కాకుండును!

సుద :—పొరపాటు. క్షమింపవలయును. నేటివరకు రాజ్యస్వీకారమున కాసపడియుండ లేదు. మున్నెప్పటికిఁ గోరఁబోను. నన్ను ప్రాణములతో విడిచిపుచ్చిన మాయమ్మతో నెందైన జీవించుచుందును.

కాల :—బాలకా! చాలు! నీమాయలు నాయెదుటసాగిరావు. నీవపేక్షింపకుండగనే మోసకాడగు మంత్రి ఈసర్వస్వము కట్టగట్టి నీతలపైఁ బెట్టుట కాలోచింపుచుండెనా?

సుద ;—ఓ వీరపురుషా! నాయభిప్రాయము సప్రమాణముగా దలంపుము.

చ. తలపనురాజ్యభోగములు గ తండ్రిగతించిన నాటనుండి భూ
తలపతియగ్రజన్ముడని గ తద్దయుభక్తిని పూనిగొల్వ ని
శ్చలమగు ప్రేమనెంచెదను గ సత్యము సుమ్మిది మంత్రిశేఖరుం
డిల ననురాజుజేయు పలుకేది యెఱుంగను దైవసాక్షిగన్.

ఓయీ ధర్మస్వరూపా! బుద్ధిపూర్వకముగా వచించు నా పల్కులు విని కర్తవ్య మూహింపుము.

మ. కలనైనన్ బరవిత్తభోగములనే గ గాంక్షింప నిత్యంబు త
ల్లుల కత్యంతము సోదరాగ్రణికి, కే గ లున్ మోడ్చి సేవింప చిం
తిలు నన్నిట్లు వధింప బూనుకొన ధా గ త్రిన్ లోకనింద్యంబు వం
శ లతాచ్ఛేదన మాచరింపఁదగునే? సత్యంబుఁగుర్తింపకన్.

కాల :—రాజకుమారా! నీధర్మోపన్యాసములతో నాకిప్పుడు పనిలేదు. స్వామికార్యము నిర్వహింపక తప్పదు! నీకడసారి కోరిక కోరుకొనుము.

భా :—కౌశికా! ఈదుష్టునకు కాలమాసన్నమగుటచేతనే; ఏపాప మెఱుగనని బ్రతిమిలాడు పసిబాలుని సంహరించుటకు సాహసింపుచున్నాడు!

శా :—గురువర్యులీ సమయమున యుపేక్షింతురా ?

భా :—లేదు ! సమయమునకు వేచియుండెదను.

సుద :—(తనలో) హా హతవిధీ! నేనీమూర్ఖుని ఖడ్గమునకు బలికావలసినదేనా? అయ్యో! ప్రపంచ నిర్మాణమెంతలో యెట్లుమారుచున్నది! హా! పరమేశ్వరా! ఆపత్కాలబాంధవా! సృష్టి స్థితి లయ కారణకర్తవగు నిన్నొకసారి స్మరించిన దుఃఖపరంపరలు నశించునుగదా తండ్రీ! "దిక్కులేనివారలకు దేవుడేదిక్కనుమాట" నిరర్థకమేనా? సర్వేశ్వరా! నాకిప్పుడెవ్వరు శరణ్యులు? ఈ ఘోర కాంతారమున నాదీనస్థితిని గ్రహించి ఈకఠినచిత్తుని బారితప్పించువారు లేరే? ఱెక్కలులేని పక్షివలె సల్లాడుచు నేనీ దుర్మరణ దండన మనుభవింప వలసినదేనా?

ఉ. పాపమొ పుణ్యమో తెలిసి ॥ బాలుడనంచుఁదలంపలేక న
న్నీపగిదిఁ వధింపగను ॥ నెంచి సహోదరుడంపెవీనినిఁ
గాపురుషాధముండితడు ॥ గాంచునె? ధర్మపథానుబోధ ల
య్యో! పరమేశ! నాకిచట ॥ యెవ్వరు లేరు ప్రోవగన్.

"శరణాగతపోషకుండను" నీబిరుదు నిరర్థకమేనా ?

మ. ఉరిలోజిక్కిన పక్షిచందముగ నే ॥ నున్నాఁడ యిప్పట్టునన్
దరి దాపెవ్వరు లేరు నీచు డితడు ॥ ద్యక్రోధముఁ బూని నా
శిరముం గూల్పగ వేచియుండె నకటా ॥ చేజాచి ప్రార్థించినన్
కరుణంజూడడొకించుకేనియును కిం ॥ కర్తవ్యతామూర్ఖుఁడై.

ఓపరమేశ్వరా ! సకలాంతర్యామివగునీకు గనుపించని చోటుగలదా ? నీవెఱుంగనిరహస్యములుండునా? దీనశరణ్యా! పాహి మాం ! పాహిమాం !!

కాల :—రాకుమారా ! నేనాలస్యముచేయుటకు వీలులేదు. ఇదిగో ! ఈకత్తి వేటుచే నీకు శాశ్వతపుణ్యలోకము కల్గును. సంసిద్ధుడవు గమ్ము. (కత్తిలేవనెత్తును)

భార :—(ఇఱువురికడ్డముగానిలచి) ఛీ! దుష్టాత్మా! ఆగు మాగుము. ఏదోషమెఱుగని నిష్కల్మషచిత్తుడగు యీపసిపాపని జంపసాహసింతువా? కుటిలుడా! తప్పులేనివానిదండించిన తత్పాపఫలము నీ వంశవృక్షమును కూకటివ్రేళ్లతో పెళ్లగించి నశింపజేయకుండునా? చాలు! చాలు!! నీయత్నమింక విరమింపుము.

కాల :—ఓవెఱ్ఱిబాపనయ్యా! నిన్నిక్కడికి మాయిద్దఱికిమధ్యవర్తిగా పిలువలేదు. (వెకిలినవ్వుతో) సన్యాసిగాడవు. నీనీతులతో నాకక్కఱలేదు. కొన్నాళ్ళుబ్రతుకదలంతువేని నీదారిని నీవుపొమ్ము. లేదేని ఈబాలుని గతే నీకు పట్టును. (సుదర్శనునిచూచి) సుదర్శనా! నాచేతజిక్కి తప్పించుకొనుట నీకేగాదు, కాలయమునికైనా శక్యముగాదని భావింపుము. (మీసము దువ్వుచు) నాకోపమునకు గుఱియైన నిన్నిబడుగుజెడదారియా రక్షించువాడు?

(సుదర్శనుని మెడవంచి కత్తిపైకెత్తును)

భార :—ఓరీ మదోన్మత్తా! ఒడలు తెలియక మిడిసిపడుచు ఏమని ప్రేలితివిరా తుచ్ఛుడా! యుక్తాయుక్తములు గ్రహింపని మందబుద్ధివై నీవు చేయబోవు పాపఫలమిప్పుడే యనుభవింతువుగాక!

(సక్రోధమున)

గీ. కలుష రహితుని కంఠమే । కత్తిచేత
తెఱుగ యత్నింపు చుంటివో । దాని వలన
నీదు శిరముర్విపై గూలి । నిముషమందె
కాకి గ్రద్దల కెంపును । గఱువుగాక.

కాల :—ఉః. పిల్లి శాపాలకు ఉట్లుతెగునా? (భారద్వాజుని త్రోసిపుచ్చి) సుదర్శనుని మీదికి కత్తివిసరగా అదేఖడ్గము తనకు తగిలి) హా! చచ్చితి చచ్చితి!! (తలతెగి క్రిందపడిపోవును)

సుద :—(సంతోషమున) ప్రాణరక్షకులైన మునీంద్రున కభివందనములు. (భారద్వాజుని పాదములపై వ్రాలును)

భార :—దీర్ఘాయుష్మాన్ భవ! దీర్ఘాయుష్మాన్ భవ!! (లేవనెత్తి) కుమారా! భయపడకుము. నీవిషయమంతయు దివ్యజ్ఞాన శక్తిచే గ్రహించితిని. దురాశాపాశబద్ధుడై రాజ్యకాంక్షితుండగు శత్రుజిత్తు నీ కిట్టి మరణదండనము విధించుటేగాక నిరంతరము మీ శ్రేయోదాయకమునకు పాటుబడుచున్న ధీమంతుని యొంటరి పాటున బంధించి కారాగారవాసుని గావించెను.

సుద :—హా! పాపము శమించుగాక! శమించుగాక!! (మూర్ఛిల్లును)

(భారద్వాజుడు కమండలోదకము సుదర్శనునిపై చల్లును)

సుద :—(లేచి) హా! ధీమంతామాత్యపుంగవా! ఈ నిర్భాగ్యుని మూలమున నీకు చెరసాలావాసము ఘటించెనా? సద్గుణరాశివై పితృసమానునివలె పోషించు నిన్నా దురాత్ముడు చెఱబెట్టించుట? నిరుపద్రవరాజ్య కార్యాలోచనుండవై తండ్రికి కుడిభుజము రీతి వర్తించిన నీకా? దుర్భరప్రయాసము. "కాలస్యకుటిలాగతిః" యను వాక్యము వ్యర్థముకాలేదే?

సీ. కనిపెంచి నటువంటి కన్నతండ్రివిధంబు
ముదమందుచుండు నీకిదిఫలంబె?
మావంశవృద్ధిని మదినెంచుచుండెడు
సదమల హృదయ! నీకిదిఫలంబె?
జనకుడు మరణింప శత్రుభయంకర
మొదవగా నొప్పు నీకిదిఫలంబె?
ప్రభుభక్తివిశ్వాస భావంబులో మమ్ము
వదలక బ్రోచు నీకిదిఫలంబె?

గీ. బ్రతికియున్నంత వరకు నీప్రాణమాన
విత్తములు మాకుజేకూర్చ వెతలబడెడు
పుణ్యమూర్తివి నినుబట్టి మూర్ఖచిత్తు
డదయుడై ఘోంజెఱనుంచుటిదిఫలంబె!

అక్కటకటా ; పచ్చనిపంటచేనువంటి రాష్ట్రమెంత పాడుబడుచున్నదో కదా? వినయవిధేయార్చనల కప్పుడగు ధీమంతుని జెఱబంచుటయు ఏకగర్భజనితునివలె తనయందు భయభక్తి విశ్వాసములతోనుండు నన్నియడవిలో జంపబంపుటయు సంఘటించిన ఆపరమ కిరాతకుడు పురజనుల కన్నీరుతోపాటు వారి యసువులెంత యొడిగట్టుకొనుచుండునో (కోపమున శత్రుజిత్తునుదలంచి) ఓరీకుల పాంసనా! మంచి చెడ్డలు విమర్శింపక ఎంతటి పాపకార్యముల కొడిగట్టుకొనుచుంటివిరా? గోముఖవ్యాఘ్రమా! నీహృదయము నవనీత సమానమని, భావించితినిగాని ఇంతటి విషపూరిత మానసుండవని గ్రహింపనైతిని దుష్టుడా; నీవింతటి కృతఘ్నుడవగుదువని కలనైన దలంపకుంటినే? (ధీమంతుని యుద్దేశించి) ధీమంతా! ఈకష్టకాలమున మనకెవ్వరుదిక్కు?

గీ. నిన్ను జెఱసాల పాల్జేసి నన్నరణ్య
మునను దెగటార్చ బంపించె జనని కెన్ని
యెగ్గులను గూర్చునోయింక నేది తెఱవు ?
దైవవిధి యెట్టులున్నదో దలపమనకు.

(క్రిందికితలవంచి విచార పడుచుండును)

భా :—కుమారా! విచారింపకుము సాధుబాధకులు తప్పక నశింతురు పరితాప మనవసరము కాలము సమీపించుటకు నిరీక్షింపు చుండ వలయును.

సుద :—(చేతులుజోడించి) మునీంద్రా; నేటికి తమయనుగ్రహమున గండము తప్పినది నాఅభివృద్ధినిగోరు ధీమంతుడు బద్ధుడై యుండెను. తెక్కలురాని పక్షివిధముగానుండు నాకింక శరణ్యా మెవ్వరు?

భా :—ఆయుష్మంతుడా! సందేహింపకుము దేహధారి కనవరతము కష్ట సుఖములు సంఘటింపుచునే యుండును!

గీ. కొన్ని దినములు చీకటి ♦ కొన్ని దినము
లందు, వెన్నెల శోభిలు ♦ నావిధంబె
విపినవాసంబు నెడబాయ ♦ నృపులుగొల్వ
సార్వభౌముడ వౌదువు ♦ సత్యముగను.

సుదర్శనా; వేయేల అచిరకాలమందే తాత ముత్తాతలచే పాలింపబడిన స్వీయరాజ్యప్రాప్తియు శత్రునాశనము సమరవిజయము కళత్ర సంశ్లేషయు లభింపనున్నవి నాయనా; ప్రస్తుతము నావెంట రమ్ము! ఆశ్రమస్థలమందు కొంతకాలము నిలిచి సకల విద్యావిశారదుండవై పిమ్మట, మాతామహుని సందర్శింపుము.

సుద :—మహాప్రసాదము! తమయాజ్ఞ శిరసావహింతును.

భార :—కౌశికా; నేటినుండి సుదర్శనుని కడుజాగ్రత్తగా నడపుచు సహాపాఠకుని జేయవలయును.

కౌశి :—గురూత్తమా; భవదీయాజ్ఞ సర్వదా ఆచరణీయము!

భార :—నాయనా! సుదర్శనా; కౌశికా; రంపు కాలమతిక్రమింపు చున్నది.

సుద }
కౌశి } చిత్తము (అందఱు నిష్క్రమింతురు)

ద్వితీయాంకము సమాప్తము



ఓం




## తృతీయాంకము

### 1-రంగము

(రాజసౌధమున యొంటరిగా మనోరమ ప్రవేశించును)

మనో :—హా! దైవమా! విధివైపరీత్యమున కేమని చింతింపుదును

చ. నరపతిలోకనిందను మనంబున నెంచి విచారమగ్నుడై
మరణముజెందె పుత్రుడరి మాయకులోబడి యెందుబోయెనో!
యెఱుగదురూహ్యమయ్యె మదికేమియుదోచదు మంత్రినుగ్రతన్
జెఱనిడి శత్రుజిత్తు నివసించెను భూపతిసింహపీఠిక౯.

పతివియోగజనిత దుఃఖపరంపరలలో మునిగితేలు నాకుఁ (గోరుచుట్టుపై రోకటిపోటను) సామెతవలె కన్నకొడు కెడబాటుకూడా సంభవింపవలయునా? హా! కుమారా! సుదర్శనా! ఏసుందరవదనారవిందసందర్శనమున జీవితేశ్వరుని వియోగవిచారభారముడిగిపోవుచుండెనో ఏవంశోద్ధారకునిముద్దుముచ్చటలచే సపత్నీగర్హితావమాన విషాద మంతరింప సంతసింపుచుంటినో ఏసుగుణరాశి యెడబాటొక నిముష మొకయుగముగా దలంపుచు తల్లడిల్లుచుందునో! అట్టిపుత్ర రత్నమును నిన్నుగోల్పోయిన నాకు ఈజీవితాపేక్షయేల? ఈసకల విభవాతిశయములేల? నాయనా! నీవు కనుపించని యీప్రపంచము నాకన్నులకు కాళరాత్రముగానున్నది.

మ. కొమరకా! నీవెటనుంటివో? ఖలులు నీ । కున్ హానిగావించిరో?
అడవుల్బల్లెలు పట్టణంబులను నీ । వై నీవె చూడంగ బా
ల్పడినావో? మదికేమిదోచదకటా । పాపాత్ముడీశత్రుజి
త్తుడు నీకెట్టివిపత్తుగూర్చెనోకదా । దోషంబులెక్కింపకన్.

హా! ముద్దులయ్యా! నాహృదయ సముద్రమున విచార తరంగము లంతకంతకుమేరమీరుచున్నవి! నీయెడబాటు సహింప లేనురా తండ్రీ!

సీ. అల్లారు ముద్దుగా । నంకపీఠమునెక్కి
గంతులువేయ నే । గాంచలేదు
ముఖముపై జీరాడు । ముంగురుల్జక్కగ
దీరిచి ముద్దుల । దేలలేదు
ముదముతో కాల్యన్న । ములుగూర్చి నాచేత
దినుపించు కోరిక । దీరలేదు
సకలావనీచక్ర । సార్వభౌముండవై
శోభిల్ల గనులార । జూడలేదు

గీ. స్వర్గమున నుండు తండ్రికి । భక్తితోడ
పిండదానంబుగావింపు । చుండునిన్ను
జూచు పుణ్యంబు నుంతయు । నోచలేదు
యింతటినె బాపె నిను, విధి । నేమనందు?

ప్రాణవిభుండు కాలధర్మమందుటయు జీవనాధారుడగు కన్నకొడుకు, నన్నెడబాసిపోవుటయు నేనిప్పుడు టెక్కలు విఱిగిన పక్షినైతినిగదా! హా! దుర్భరము! దుర్భరము!! (ఆలోచనవహించి) దైవమా! సవతికొడుకు శాసనమునకు తలవంచి రాజమాతయగు లీలావతి పరిహాసమునకు గుఱినై ఈపాపుదేహమున యసువులెట్లు నిల్పగల్గుదును అబ్బా! దుర్భరము! దుస్సహము! ప్రభుత్వగర్వ మదాంధుడై శత్రుజిత్తుడిప్పుడే దాస దాసీజనులనా యాజ్ఞదిరస్కరింప జేయుచున్నాడు. రాత్రింబగళ్లు కన్నీటిధారలు కాల్వలై ప్రవ

హించ నేవచ్చుచున్నను నాసుతునిజాడ చెప్పెడు దిక్కు నాటి కొక్కడైన గానరాడు అయ్యో దైవమా! దిక్కులేనిదాననై బ్రతుకవలసిన దేనా!

చ. తనయునిజాడ గుర్తెరుగ న తండ్రికిదెల్పుటొ? లేకఘోరకా ననముల నొంటనై దిరిగి నే నాసుతు నారయబూనుటో? హితం బౌనరెడుగాని నేనిచట నే నుండిన మోసము గల్గజేయు దు ర్జనుడగు శత్రుజిత్తు డెదనజాలివహించునె ధర్మమూర్తియై.

ఇప్పుడు నాకేదికర్తవ్యము చెప్పుమా? (ఆలోచించి) కర్తవ్యమేమున్నది. సమయమరసి పురమునిర్గమించి చిరంజీవిని వెతు కుటయే ముఖ్యమని దోచుచున్నది.

(మనోరమ నిష్క్రమించును)

## 2-వ రంగము

(సౌధమున యుధాజిత్తు శత్రుజిత్తు లీలావతి ప్రవేశింతురు.)

యుధా :—నాయనా! శత్రునిష్కంటకమగు నీరాష్ట్రమును నిస్సందే హముగా నిర్భయముగా స్వేచ్ఛానుసారముగా పరిపాలింపుము నీకు నేనన్నివిధముల కూడిభుజమురీతిగా వర్తింపుచుండెదను (లీలా వతినిచూచి) అమ్మాయీ! నీకుమారున కన్నివిధముల విజయము లభించినది. నీవింక స్వస్థచిత్తవై యుండుము.

లీలా :—తండ్రీ! నీయనుగ్రహమున మేమెల్లవిధముల నేటికి ధన్యుల మైతిమి!

శత్రు :—తాతా! నీమంత్రము చక్కగా ఫలించినది. సుదర్శన పక్ష పాతియగు ధీమంతుని ఆజన్మాంతకారశిక్ష విధించితిని సకలసామ్రా జ్యమునకు పట్టభద్రుండనౌదునని విజ్ఞప్తిగుదాయాది శిరచ్ఛేదన మొనరింపజేసితిని పుత్రవియోగార్తయగు పట్టమహిషి నేటికిదిన త్రయము క్రిందట నగరువెల్వడి యరణ్యముల పాలైనది. నాకింక ఎవ్వరిచేతను భయము లేదు.

యు :—వత్సా ! అట్లైనట్టికి దలంపరాదు శత్రుసముదాయంబులు సమయంబునకు వేచియుందురు విశ్వాసపాత్రులగు మంత్రులతో రాజకార్యాలోచనము చేయవలయును ప్రజానుకూలముగ భూమండలము నేలుకొనుము నేనిక పోయివచ్చెద.

(భటుడు తొందరగా ప్రవేసించి) ప్రభూ ! మోసము ! మోసము !! మనకార్యమునకు విఘాతము సంభవించినది.

యు :—ఓరీ సేవకా; ఏమిమోసము? ఏమావిఘాతము?

భటు :—మహారాజా! చెప్పుటకు భయమగుచున్నది;

శత్రు :—నీవింతగా తొట్రుపడనక్కరలేదు నిర్భయముగా చెప్పు;

భటు :—బాబూ; ఏలినవారి సెలవు ప్రకారము యువరాజుగారిని మచ్చు మందుచే కన్నుగ్రాయి మధ్యరాత్రమున ఘోరారణ్యమునకు గొనిపోయితిమి!

శత్రు :—తర్వాత?

భటు :—తర్వాత మహారాజుగారి ఆజ్ఞ ప్రకారం కాలనేమి తనపదును కత్తి వఱనుండి బెటికి తలనఱుక యత్నించెను.

యు :—పిమ్మట ఏమిజరిగినది?

భటు :—జరుగునదేమున్నది కాలనేమియడుగులంబడి సుదర్శనుండు నలుదిక్కులు మార్రోమ్రయ రోదనము సేయుచు తన్నురక్షింప ప్రార్థింపసాగెను;

శత్రు :—ఓహో ? తెలిసినది దుఃఖపడినంత మాత్రమున జాలిగొని నాపగతుని ప్రాణములతో విడిచిపుచ్చెను కాబోలు?

భటు :—దేవా! లేదు! లేదు!! ఆదుండగీని చెండాడు సమయమునకు భారద్వాజుడను బడుగుతపసి యడ్డుపడి త్రోకద్రొక్కిన త్రాచు పామువలె మండిపడుచు మనకాలనేమిని నశింప శపించి సుదర్శనుని వెంబడించుకొని పోయెను ఏలినవారికీ విషయ మెఱింగించుటకు నేనెట్లో జీవచ్ఛవంబురీతి బ్రతికియుంటిని.

శత్రు :—ఆహా! విధివైపరీత్యమున క్షేమనవలయును? ఈ శత్రుజిత్తు కోరిక విఫలమయ్యెనుగా? (తలవంచి విచారమవలంబించును).

యు :—(సక్రోధమున) ఓయీ! భారద్వాజా; అరణ్యమున ముక్కుబట్టుకొని కూర్చుండువాడవు నీవా; ఈయుధాజిత్తుని సంకల్పమున కడ్డుకొనువాడవు? ఆకులలములు కందగడ్డలుతిని కండక్రొవ్వున యొడలెఱుంగక మిడిసిపడుచు రాజకార్యమున పాల్గొందువా? (సుదర్శనుని ఉద్దేసించి) ఓరీసుదర్శనహతకా; మునిమ్రుచ్చుల చెంతనున్న ప్రాణభయము లేదని భావింపుచుంటివి కాబోలు? ఈ యుధాజిత్తుని మేనప్రాణమున్నంతవరకు నిన్నుదెగటార్చుటకు ప్రయత్నింపక మానడని గుర్తింపుము (శత్రుజిత్తును బరికించి) ఆయుష్మంతుడా; విచారింపకుము నాకంఠమున యూపిరియుండు వరకు ఆదురాత్ముని వధోపాయమాలోచించెద! ఆతాపసాశ్రమమున మఱుగుపడి ఫల సమిత్కుశ పుష్పగ్రహణమున కరుదెంచినప్పుడైనను నదీజలస్నానమున కేగుతఱినైనను నీవిరోధిని రూపుమాపెదను నావాక్యము సప్రమాణమని గమనింపుము;

లీలా :—తండ్రీ! నీకు తెలియనిదేమున్నది! వైరిమారణము వినువరకు హృదయవైకల్యము తొలగుట దుర్లభము!

శత్రు :—భగ్నమనోరథుండనగు, నాకా శుభవార్త వినుపించునా?

యు :—వత్సా; సందేహింపవలదు సాధ్యమగునంతవరకు నీపగతుని త్వరలో తుదముట్టించెద (భటునిజూచి) సేవకా; సర్వసమర్థులగు నలుగురిభటుల నావెంటవచ్చునట్లు నాయాజ్ఞ శాశింపుము! నీవిక పొమ్ము.

భ :—చిత్తము! (నిష్క్రమించును)

యుధా :—చిరంజీవీ! ప్రస్తుతం మనము కొన్నిరహస్యముల నాలోచింపవలయును నావెంటరమ్ము!

శత్రు :—యుష్మదీయాజ్ఞ సర్వదా ఆచరణీయము!

(అందఱు నిష్క్రమింతురు)

## 3-వ రంగము

(చెరసాలయందు ధీమంతుడు విచారమున ప్రవేశించును)

ధీమ :—(తనలో) ఆహా! జగన్నాటక సూత్రధారియగు పరమాత్ముని చిద్విలాసమెంతలో యెట్లుపరిణమించినదే! జీవయాత్ర గడుపుటకు ఈకారాగారమే నానివాసస్థానమా? (తానొకటిదలప దైవమొకటి దలచు) ననుమాట యదార్థమైనది! కన్నతండ్రివలె నల్లారు ముద్దుగాబెంచి పెద్దవానిగావించి విద్యాబుద్ధులు గఱిపించి మహోన్నతపదవి నలంకరింపజేసి సర్వకార్యక్రమ నిర్ణయప్రధానునిసల్పి బహిఃప్రాణమురీతికాపాడిన భూపురందరుని తుదికోరిక నెరవేర్ప లేని దౌర్భాగ్యస్థితికి బాత్రుడనై "పూలమ్మినయూరకట్టెలమ్ము కొన్నట్లు ఖైదిగాజిక్కి హీనముగా బ్రతుకవలసినరాత పట్టెనే?

సీ, పట్టుబట్టలు మేన ꣻ గట్టునే నిప్పుడు
చింపిరిగుడ్డ ధ ꣻ రింపవలసె
పంచభక్ష్యాన్నముల్ ꣻ భక్షించునేనిప్డు
మొక్కజొన్నలకూడు ꣻ మెక్కవలసె
పట్టుపరుపులపైన ꣻ పవళించునేనిప్డు
బండనేలలయందు ꣻ పండవలసె
ధర్మహర్మ్యంబుల ꣻ వర్తించునేనిప్డు
కారాగృహంబున ꣻ గ్రాలవలసె

గీ. ప్రజలజోహారులఁ బెందు ꣻ వాడు నేడు
సేవకులకెల్ల చెయ్యెత్తి ꣻ సిగ్గువిడచి
యూడిగంబులు సల్పుచు ꣻ నుండవలసె
నాకు యీదేహమేల? ప్రాణంబులేల?

అక్కటా! దినగండము నూరేండ్లాయువన్నట్లు ఈచెర ాలబాధలు భరింపవలవిగాకున్నవి. పదిమందిలో తలయెత్తుకొని జీవింప కని యీపాపుబ్రతుకు బ్రతుకుటకంటె మరణమే శరణ్యమని దలంచె ను (ఇంచుకాలోచించి) సర్వసమర్థుండనగు నన్నేకారాగార వాసుని

జేసిన ఆ పరమద్రోహి ఆతుచ్ఛస్వభావుడు యెండకన్నెఱుంగని ఆపసి బాలుని కెన్నియిడుములు గూర్చెనో కదా? పాపమూ పరమసాధ్వీమ తల్లి మనోరమాదేవి యెట్టి యిక్కట్టులకు లోనయ్యెనో? దుష్టులకు పాప పుణ్యముల విచక్షణముండునా? (శత్రుజిత్తు నుద్దేశించి) ఓరీ కులద్రోహీ! విశ్వాసఘాతకుడా! ఎంతపనిచేసితివిరా?

గీ. పామునకు పాలుబోసిన ♦ పగిదినీకు
నేనుచేసిన యుపకృతుల్ ♦ నిక్కముగను
ద్రోహములరీతి దోచెనే ♦ దుర్మదాంధ
సిగ్గుచేటగు నీమాట ♦ చెప్పకొన్న.

కృతఘ్నుడా! నీవింతలో యింతవాడవగుదువని కలనైన దలంపనేరక మోసపోయితిని కుచ్ఛితుడా! నీకపకారము చేయదలంపని నాకా? కారాగారబంధనము విధించుట? ఛీ! ద్రోహి!

గీ. భవ్యసామ్రాజ్యపదవి జే♦పట్టదలచి
సాధుజనముల బాధింప ♦ సాహసించి
తౌర! తత్ఫల మేనాటి♦కైన నీవు
పొందకుందువె? నాచేత ♦ మూర్ఖచిత్త.

ఏమిదీ నావెఱ్ఱితలంపు ఇప్పుడీ చెఱతప్పినగదా ద్రోహికి ప్రతీకార మొనర్చుట (నలుదిశలు దిలకించి) మేలు! మేలు!! తగిన యూహాస్ఫురించినది. (సంతోషమున) మానవప్రయత్నములో నెఱ వేరని కార్యముండదు. అదిగో? ఆగవాక్షమున కమర్చిన యినుప ఖడ్డీలు పెకిలించి ఇటనుండి తప్పించుకొని మీదటికార్యమాలోచింప వలయును. (నిష్క్రమించును)

## 4-వ రంగము

(కాళికాలయమున సుదర్శనుడు ప్రవేశించును)

సుద :—(తనలో) తల్లీ! భవాని! నీయనుగ్రహముకోరి నిరంతరమూ పరితపించు ఈదీనుని మొరాకర్ణించి రక్షింపవా శాంకరీ!

ఉ. తల్లినిఁగోలుపోయితిని ♦ తండ్రిగతించె మదీయవృద్ధినే
యెల్లపుడెంచు మంత్రివరు ♦ డిక్కటులందుచు కారనుండె సం
ధిల్లెను శత్రుభీతి కడుసంకటుడ నన్గృపజూపుమమ్మ, నీ
చల్లని సత్కటాక్షమున ♦ సాకగదమ్మ పదంబులంటెదన్.

అంబా! భక్తపరాధీనవగు నీకు నాయందనుగ్రహమురాదా

సీ. నీకటాక్షమెగాదె ♦ లోకముల్ప్రజనాల్గి
వృద్ధిక్షయంబుల ♦ వెలయుచుంట
నీకటాక్షమెగాదె? పాకశాసనుడాది
దేవతల్మోదమున ♦ దేలుచుంట
నీకటాక్షమెగాదె ♦ నిఖిల తాపసకోటి
కాధారమార్గమై ♦ యలరుచుంట
నీకటాక్షమెగాదె ♦ నింగిని రవి చంద్ర
తారకల్ దీప్తిని ♦ దనరుచుంట

గీ॥ నీకటాక్షంబుచే గాదె? ♦ నిర్వికార
హృదయులై భక్తులెందఱో ♦ ముదముగనుట
అట్టి సద్గుణరాశివో ♦ యంబ నన్ను
పాలనము జేయగా నీకు ♦ భారమగునె?,

ఓ త్రిపురాసుర సంహారిణీ! ఏమెఱుగని యీ పసిబాలునిపై యింత నిర్దయవహింతువా?

మ॥ నినుగొల్వన్ శ్రమలంతరించునని మాకాసీంద్రుండు బోధింపగా
విని నీపాదములాశ్రయించితిని దేవీ; దీనుడన్ నన్ను బ్రో
చిన రక్షించిన నీదెభారమిక నాకచిత్తంబు నీసొత్తు; మ
న్నన బ్రోవంగదె? సద్గుణకదంబా రాజరాజేశ్వరీ.

లోకజననీ, నీ భక్తవాత్సల్యము నాపై నించుక ప్రసరింపచేయుము. మహాకాళీ! పాహిమాం; పాహిమాం; (ధ్యానతత్పరుడగును)

(మహాకాళి ప్రత్యక్షమగును)

కాళి :—కుమారా! సుదర్శనా! నీయమోఘమైనభక్తికి మిక్కిలిసంతసించితిని. మనసారనన్ను స్మరించి నా దయ నపేక్షించు వారికెట్టి

బాధలు రాకుండ కాపాడుట నాకర్తవ్యము! వత్సా! లెమ్ము!
నీయోగనిష్ఠ చాలింపుము.

సుద :— (కండ్లువిప్పిచూచి) తల్లీ; ధన్యుడను! ధన్యుడను!!

గీ॥ ఆకులలములు మెసవి ఘోరాటవులను
తపము సలిపెడు తాపస తతులకైన
దరిశనముగాని నీదివ్య దర్శనంబు
గలుగఁజేసితివోయంబ కరుణనాకు

(కాళికాదేవి పాదములపై బడి నమస్కరించును.)

కాళి :—(సుదర్శనుని లేవనెత్తి) ఆయుష్మంతుడా! నీవిప్పటికి కృతార్థుడవైతివి. గడచినదానికి విచారింపకుము; ఇదిగో! ఈ ఖడ్గమును పరిగ్రహింపుము. నీ కాపద కలుగుసమయమున నన్నుస్మరింపుము. సర్వకార్యనిర్వాహకంబు నేనే యొనర్చి నీకు శుభంబు కలిగించెదను నీవింక భారద్వాజుని యనుమతి ననుసరించి వర్తింపుము. పొమ్ము; (అదృశ్యమగును)

సుద :—(సంతోషమున) ఆహా! మునీంద్రుని మహదాశీర్వాదము ఫలించినది. (ఆలోచించి) త్వరలో గురూత్తముని జేరుటయే నాకిప్పుడు కర్తవ్యము. (నిష్క్రమించును)

5—వ రంగము

(ఆశ్రమమందు భార, సుద ప్రవేశింతురు)

భార:—రాకుమారా! భగవతియనుగ్రహంబున నేటికి సఫల మనోరథుండవైతివి; ధనుర్వేదాద్యఖిల విద్యావిశారదుండవైతివనుటలో సంశయములేదు. ఆలోకమాత్ర కటాక్షంబునకు బాత్రుడవై వైరి శిరఃఖండనోద్దండచండతర కరవాలంబును సంపాదించితివి! చిరంజీవీ! నీకెందున కొఱతలేదని దలంపుము. ఇదిగో! ఒక్కవిషయము మాత్రము నీకు చెప్పవలసియున్నది. త్వరలో నీమాతామహుని

జేరి తదనుమతిని శత్రుజన గర్వనిర్వాపణుండవై స్వీయరాజ్య లక్ష్మీకరగ్రహణుండవుగమ్ము.

సుద :—చిత్తము! దైవసమానులగు తమయానతి నిరంతర మాచరణీయము.

భార :—బాలకా! పట్టభద్రుండవై నప్పుడు మమ్ము మరిచియుందువే మొ?

సుద :—(ఆశ్చర్యముతో) తండ్రీ! ఎంతమాట;

సీ. కఠినులచేఁ జిక్కి ♦ ఖండింప బడుచుండు
తఱి నన్ను గాచిన ♦ కరుణ పెంపు
ఏదిక్కు గానక ♦ ఖేద మొందెడు నన్ను
చెంతకు జేర్చిన ♦ స్నేహగరిమ
విద్యనెఱుగని నాకు ♦ విపులశాస్త్రజ్ఞాన
మును బోధసలిపిన ♦ ఘనతరంబు
పట్టభద్రుడవౌచు ♦ బఱగుదీవని మంగ
ళాశీర్వచనమిచ్చి ♦ నట్టి ప్రేమ

గీ. నాదు ప్రతిరోమకూపము ♦ ల్బాదుకొనగ
మహిని జెందిన మేలును ♦ మరచియుండు
నట్టి విశ్వాసఘాతకం ♦ బాచరింప
మదిని దలపోయ, మీ దివ్య ♦ పదములాన.

తండ్రీ! తామీ దిక్కుమాలినవానికి చేసిన మహోపకారమును దలంపక చరించునంతటి మందభాగ్యుడనై జన్మ జన్మాంతరములనుభవించిన తీరని ఘోరపాపము నొడిగట్టుకొను కృతఘ్నుడను గాను.

భార :—కౌశికా! కౌశికా!!

(కౌశికుడు ప్రవేశించి) మహాత్మా! ఏమిసెలవు?

భార :—సుదర్శనుడు మాతామహుని జేరుటకు ఈ అభిజిన్ముహూర్తమెంతయు మంగళప్రదముగానున్నది, ఫలాక్షితలు తీసికొనిరమ్ము!

కాశి:—చి త్తము! (నిష్క్రమించి తిరిగి ఫలపుష్పాక్షతలతో ప్రవేశించును)

భార :—నాయనా ! సుదర్శనా ! ఆలసింపరాదు. త్వరపడుము.

సు :—మహాప్రసాదము గురువర్యుల కభివాదనములు (పదములపై బడును.)

భార :—(లేవనె త్తి) దీర్ఘాయుష్యమస్తు! శీఘ్రమేవ వివాహప్రాప్తిరస్తు. (అక్షతలు పైనచల్లి పూలు పండ్లు దోసిటిలో వుంచును)

కాశి :—(సుదర్శనుని కౌగిలించి) మిత్రమా ! నిన్నెడబాయుట మిగుల కష్టముగానున్నది. తిరిగి నీ దరిశన మెప్పుడు కలుగనున్నదో ? విచారము బూనును.)

సుద :—కౌశికా ! సర్వము దెలిసిన నీ బోటివాడు విచారింపజెల్లదు. దైవ మనుకూలించెనేని యచిరకాలమందే గురూత్తముల సందర్శింపగల్గుదును.

భార :—నాయనా ! వేళ యతిక్రమింపుచున్నది రమ్ము !

(సుదర్శనుని సాగనంపుచు అందఱు నిష్క్రమింతురు)

## 6–వ రంగము

(అరణ్యమున చెట్టుక్రింద ధీమంతుడు ప్రవేశించును)

ధీమం :—(తనలో) ఆహా ! ఇప్పటికిగదా! చెఱసాలనుండి తప్పించుకొని పురంబు వెల్వడి యోజనత్రయంబు రాగల్గితిని. రక్షకభటుల రహస్య వచనములబట్టి సుదర్శనుని జంపించుటయు శుద్ధాంత సంచారియగు పట్టమహిషి పుత్రవియోగార్తయై పురంబు విడిచి యడవుల పాలైనట్లు గ్రహింపగల్గితిని. కటకటా ! దుర్మార్గుడగు శత్రుజిత్తు దుండగములు మేరమీరినవే ? పాప మా యిల్లాలు యెండకన్నెఱుంగని ముద్దరాలు ఏఘోరారణ్యసీమలందు దిరుగుచు పడరాని ఇడుమలపాలై ఏ దుష్టమృగముల నోటబడెనోకదా ? అయ్యో ! నాయనా ! పసిబిడ్డవగు నిన్ను జంపుటకా దుర్మార్గులకు చేతులెట్లాడెనోకదా ! తండ్రీ ! (ఇంచుక వినుటభినయించి)

అదిగో! ఈ దిశ నేదియో సవ్వడి వినవచ్చుచున్నది (ముందుకు దిలకించి) ఓహో! ఇంకేమున్నది నేను కారాగృహము దప్పించుకొనుట గుర్తించి తన యనుచరులతో యుధాజిత్తిం డిటేవచ్చుచున్నట్లున్నది. ఇప్పుడు నాకు కర్తవ్య మేదిచెప్పుమా? (ఆలోచించి) ఇప్పటికీ పొదలో తలదాచుకొనుటే ముఖ్యము. (పొదలో దాగి వినుచుండును.)

(మరియొకదిశనుండి భటులతో యుధాజిత్తు ప్రవేశించును)

భటు:—మహాప్రభూ! ఏలినవారు తలంచుకొన్న ఈసుదర్శనుడొక లెక్కయా?

యు:—సేవకా! నిజము పల్కితివి (సుదర్శనుని ఉద్దేసించి) ఓరీ సుదర్శనహతకా! ఆనాడు భారద్వాజుడు కాలనేమి కడ్డుపడిఆతని శపింపకున్నచో ఆవీరసింహుని ఖడ్గమునకెఱయై నీవీపాటికి యమాలయంబలంకరించి యుందువు కులపాంసనా ఇంతటితో నీ గండము తప్పినదని దలంపుచుంటివి కాబోలు నాబొందిలో యూపిరియుండువరకు నీవధోపాయమునకు ప్రయత్నింపకుందునని దలంపుచుంటివేమొ అట్లెన్నటికి జరుగదు. ఈబడుగు బాపలు నిన్నెంతవరకు నాగుటినుండి తప్పించి పోషింతురో చూతునుగాక (మీసముదువ్వును)

భటు:—బాబూ! మేమాబాలునిపట్టి తుదముట్టించుట కెన్నిసారులో భారద్వాజాశ్రమ ప్రదేశముల గాచియుంటిమి ఆపాపాత్ముడింత వరకొక్కనాడైన కంటబడకుండ తప్పించుకొనుచుండెను.

యు:—సేవకా! ఆద్రోహి ఈసారియెట్లు తప్పించుకొనునో చూచెదవుఁగాక రమ్ము.

భటు:—చిత్తము (అందఱు నిష్క్రమింతురు)

ధీమం:—(పొదనుండి వెల్వడి) ఈదుర్మార్గులమాటలు విమర్శింపగా రాకుమారుడు భారద్వాజ మహర్షి వలన సుఖముగారక్షింపఁబడినట్లు వెల్లడియగుచున్నది. దేవేరిమాత్ర మెందున్నది తెలిసినది

కాదు. పట్టమహిషియొకవేళపుట్టిల్లుచేరి యుండునా? (ఆలోచించి) మంచిది మునుముందువీరసేన మహారాజుగారినిం జేరి కర్తవ్య మూహింప వలయును (నిష్క్రమించును)

## 7-వ రంగము

(కాశీపురము సౌధమందు సుబాహుడు చిత్రసేన ప్రవేశింతురు)

సుబా :—ప్రేయసీ—

మ. కులముం శీలము రూప యవ్వనములు ♦ న్నోత్రోన్నతిం గల్గి భా
సిలు రాజన్యుల దివ్యచిత్రపటముల్ ♦ శీఘ్రంబె దెప్పించి ని
చ్చలు దీరవ్వరియింపుమన్న సుతకు ♦ న్సంతృప్తి సుంతేనియుం
గలుగన్నేరదు యేమిసేయుటకు మా ♦ ర్గంబైనలేకుండెడుం.

చిత్ర :—ఏమార్గము లేదని వివాహము మానుదురా యేమి? లేక లేక కలిగిన యొక్కబిడ్డకుతగినవరు నన్వేషించి పెండ్లియొనర్చి ఆనూత్న దంపతుల ముద్దుముచ్చటలువిని ఆ దాంపత్యానురాగముచూచి సంతోషించు భాగ్యము ఈజన్మలకులేదా? ఆర్యపుత్రులు తెలిసి తెలియని పసిబిడ్డ యభీష్టానుసారమాలోచించినచో నలుగురిలో మనకు తలవంపులురావా?

సుబా :—కోమలీ; ఇదేటిమాట? సకలవిద్యా విశారదయై సద్గుణతేజో నిధియై యుక్తవయస్కురాలైన కూతురు యపేక్ష నిరాదరించి బలవంతముగా నొకని మెడకంటగట్టి మనము కన్నెచెఱవిడిపించు కొన్నచో! ఆ దంపతుల సౌఖ్య మవసరములేదా?

ఉ. కాంతమనంబునం దలచు ♦ కాంతునిగూర్చిన సర్వకాల మ
త్యంత సుఖాప్తులొంచు నల ♦ రారుదు రంతియెగాని కోరికా
వంతయు లేనివానికి వి ♦ వాహమొనర్చిన తల్లిదండ్రులే
గొంతును గోసిరంచు సుత ♦ గుందును దూరును మాటిమాటికిన్

చిత్ర :—ఔను! ఇట్లెంతకాల ముపేక్షించుట?

సుబా :—బిడ్డ కనుకూలుడగు భర్తలభించువరకు.

చిత్ర :—అట్లైన మరికొన్నిరాజన్యుల చిత్రఫలకములు దెప్పించ గూడదా?

సుబా :—తిరిగి నేడే కొన్నిరాష్ట్రాధిపతుల చెంతకు మేధావిశేషజ్ఞులగు భూసురోత్తములనంపుటకు నియమించితిని.

చిత్ర :—అమ్మాయి వివాహమగునంతవరకు మన మనోవిచార భారమున కవధియుండదు.

సుబా :—ఔను! సందేహమేమి ?

చిత్ర :—మనోహరా! త్వరలో కార్యసాఫల్యమునకు ప్రయత్నింపుడు.

సుబా :—ప్రేయసీ; నీవింతగా చెప్పవలయునా? నాకుమాత్రమా యాందోళనము లేదనుకొంటివా! ఆసుగుణరాశిని చూచినప్పు డెల్ల నా పరితాపమునకు మేరయున్నదా ?

చిత్ర :—ప్రభూ! భోజనవేళ యతిక్రమించినది. దయచేయుడు.

సుబా :—మంచిది. (ఇరువురు నిష్క్రమింతురు)

## 8–వ రంగము

(కాశీపురోద్యానవనసమీపమున సుదర్శనుడు ప్రవేశించును)

సుద :—(తనలో) అబ్బా చాలుదూర పథమునడిచితిని.

చ॥ గురునియనుజ్ఞనొంది మృగకర్కోటివసించెడు ఘోరకాననాం
తరములనెల్ల దాటుచును ధైర్యమొకించుకబాయ కిప్పడీ
పురమును చేరగల్గితిని ప్రొద్దునుమంతయు గృంకలేదు భా
స్కరకిరణప్రసారముల కుగ్రగు శరీరము వేడిగాడ్పులన్.

మార్గాయాసమున దేహమంతయు స్వేదబిందువుల నిండి పోయినది. కఠినపాషాణకర్కశ ప్రదేశములందు నడచుటవలన కోమలపాదములు బొబ్బలెక్కి యడుగుతీసి యడుగు బెట్టుట మిగుల

కష్టసాధ్యమగుచున్నది. క్షుత్పిపాసలు మిక్కుటమై నోటతడియారి దేహబలముతోపాటు బుద్ధిబలమును క్షీణింపజేయుచున్నది. అడవి దిరుగుటెంత యలవాటున్నను దూరపథ ప్రయాణము మనోధైర్యమును తగ్గింపుచున్నది. (నలుదిశలుపరికించి) ఓహో ! ఇందొకశృంగార వనము అందొక రాజవిహారభవనము గాన్పించెడు నేనటకేగి ఆకలి దప్పుల నడంచుకొని కొంతవిశ్రాంతిజెంది పిమ్మట పునఃప్రయాణ మాచరించెద.

(తోటలోనికి నిష్క్రమించును.)

(తోటలో మరియొకదిశను శశికళ చిత్రభాషిణి ప్రవేశింతురు)

శశి :— సఖీ చూచితివా ! పుష్ప ఫలభరితమైన లతావృక్షములచే శుకపికమయూరకలహంసాది నానావిధపక్షిరుతంబులచే యుల్లమలరించు చల్లని పిల్లవాయువులచే నేత్రహృదయంబులకానందము కలిగించు ఈ వనరామణీయమెంత వర్ణించినను తనివిదీరకున్నది.

చిత్ర :— ఔను ! నవయవ్వన సంపద్విలాసినీమణి సరసగుణాలంకార శోభితుడగు ప్రియతముని గూడియున్న చందంబున వసంతలక్ష్మి ప్రకృతి పురుషుండగు మాధవుని గలసియున్నప్పుడు నేత్రోత్సవమున కేమికొఱంతయుండును.

శశి :— నిజము. శిశిర గ్రీష్మ హేమంతాదులకన్న వసంతుడే చక్కనివాడు. ఆతడే సకలజీవ సంతోషదాయకుడు. ఆపుణ్యపురుషుని సమాగమంబున వనలక్ష్మి ప్రకృతిశోభకు మరింతవన్నెగూర్చును.

చ. అరయ ! వసంతశిల్పి పరమాద్భుత వృక్షలతావిచిత్రకే
సరయుత పుష్పపల్లవ లసత్పరిశోభితవన్యలక్ష్మి నా
దరమున సృష్టిజేసి ప్రమదాజనకేళికి నునిక్కిజేయ సుం
దర కుమారమూర్తియన దాల్చెను కీర్తిమనోజ్ఞవైఖరిన్.

చెలీ ! ఈక్రేవ చక్కగా వికసించిన మల్లె మొల్ల విరజాజి చెంగల్వ చేమంతి పుష్పసౌరభం బెంతసంతోషమును గొల్పుచున్నదో వీక్షింపుము.

చిత్ర :—అమ్మా రాజపుత్రీ! వాటికేమిగాని ఈ ప్రక్క నించుక విలోకింపుము! దీర్ఘకాల వియోగ భర్తృసమాగమ సంశ్లేషాసక్తి యగు నింతుజవ్వని సామ్యంబుగ ఆ విశాల వృక్షమున కల్లిబిల్లిగా నల్లుకొన్న యీ లతామతల్లిని విలోకింపుము. (ఇంచుకాలోచించి) రాకుమారీ! మరచితి తండ్రిగారు నేడు క్రొత్తగా దెప్పించిన చిత్రపటములం దెవ్వరినైన వరింప సమ్మతించితివా?

శశి :—(ఇంచుక విసుకున) చాలు! చాలు!! చిత్రభాషిణీ! నీ వేళా కోళము లింక చాలింపుము.

చిత్ర :—అదేమిటమ్మా! రాజలోకమండలిని దిరస్కరించు నీ కొర కెవ్వరేని స్వర్గమునుండి యూడిపడుదురా?

శశి :—చెలీ! హృదయ మంగీకరించని వరుని వరించుటకన్న బ్రహ్మ చర్యమున వర్తించుట శ్రేయమని తలంచెదను.

చిత్ర :—అయ్యో పిచ్చితల్లీ! పరిణయోత్సవమొనర్చి మీ దంపతులు ప్రణయతరంగ డోలికలలో నోలలాడుచు సంతోషమున నుండ వీక్షించు తల్లిదండ్రుల మనోరథము భగ్నముగావించుట నీ బోటి దానికి తగునా? వయసువచ్చిన బిడ్డకు పెండ్లిజేయని తల్లిదండ్రు లకు దలవంపులు గల్గకుండునా?

శశి :—సఖీ మానవప్రయత్నము ఫలింపదు. విధి లిఖిత మనుభవింపక తప్పదు.

చిత్ర :—బాగు! బాగు!! నీ వేదాంతము పుట్టని బిడ్డల పే రడిగిన ట్లున్నది. మంచిది కానిమ్ము. ఈ గొడవంత నా కెందుకు? (ముందుకు నడచి) దేవీ! వేళ యతిక్రమింపుచున్నది. సౌధమున కరుగుదము రమ్ము. (శశికళ చెయ్యిపట్టుకొనును)

శశి :—చెలీ! నీ యిష్టమెట్లో యట్లేగానిమ్ము.

(ఇరువురు కొలను సమీపమందలి ద్రాక్షపందిరిక్రింద నిద్రించుచున్న సుదర్శనుని చూతురు.)

చిత :—దేవీ ! ఈ మహానుభావు డెవ్వరో ? ఇట నిద్రించుచున్నాడు చూడుము.

శశి :—(ఆశ్చర్య సంతోషములతో) ఔను ! పాప మీ నవమన్మథ సుందరాకారుడు దూరదేశాగమన పథ్రశాంతుడై గాఢనిద్రావస్థలో మునిగినట్లున్నది. ఈ పురుషసింహుని (సందేహించును)

చిత :—అమ్మా ! రాజపుత్రీ ! సందేహింపవలదు. శుద్ధాంత కాంతా జన రహస్యంబులు చేటీజనంబులకడనా మఱుగుపరచుట ?

శశి :—(సిగ్గున) ఆ ! ఏమి లేదు !

చిత్ర :—అబ్బా ! నీ హృదయ మెంత దృఢమైనదమ్మా ! ప్రియసఖ నగు నన్ను శంకింపతగునా ?

శశి :—శంక యేమున్నది.

చిత్ర :—అటులైన అర్థోక్తిపూరించి నా మనస్సంతోషము గావింపుము.

శశి :—ప్రియసఖీ ! ఏలనోగాని ఈపురుషపుంగవుని వీక్షించినప్పటి నుండి నాడెందమున కానందము సందేహము జాలి మల్లడిగొను చున్నవి. ఈ మనోహరాకారుని ముఖచంద్ర చంద్రికలు నాభావ ప్రపంచము నాక్రమించినవి. ఈతని సౌందర్యమెంత వర్ణనాతీతమై యున్నదో చూడుము.

చ. కమలములన్ హసింపదగు కన్నులు చంద్రుని గేరుమోము చం
దము నగవైరిబాణము విశధంబుగదోచెను భ్రూయుగంబు హ
స్తములు మదేభతుండ సదృశంబులు జెక్కులుదర్పణంబులన్
విముఖతజేయు ముంగురులు భృంగములన్నిక సక్కమాడు ని
క్కము నితడొక్కరాట్సుతుడు గావలె నన్యులకిట్టులుండునే.

చిత్ర :—(తేరిపారచూచి) దేవీసత్యమువచించితివి. ఈపురుషసింహుని కరపాదములందుండు ఛత్రచామరాందోళిక మచ్ఛకులిశ చక్రాది రేఖలు విమర్శింప నీతడు సప్తసాగర వేలావలయితభూవలయంబు నేకచ్ఛత్రంబుగా పాలింపదగిన సార్వభౌమలక్షణంబులు స్ఫురింపు

చున్నవి. ఇతని చెంతనుండు బాణ తూణీర కవచ ఖడ్గాది సాధ నంబులవలన తప్పక రాజకులాలంకారుడనియే దృఢమగుచున్నది. కాని ?

శశి :—(ఆతురతచే) కాని యనుసందేహ మేమి ?

చిత్ర :—సందేహమా ! తెల్పెదవినుము.

గీ. శిరమునందలి పెంజడల్ ॥ జిక్కుబడగ
తులసిపేరులు గళమున ॥ దోచుచుండ
కటిని కాషాయచేలంబు ॥ గ్రాలుకతన
మునిసుతుండన జెల్లదే ॥ వనితయిలని.

శశి :—(తొందరతో) సఖీ ! మిన్నకుండుము. ఆమహాభాగుడేదియో పలవరింపుచుండెను. ఆలకింపవలయును.

(ఇరువురు మరికొంత సమీపించి వినుచుందురు)

సుద :—(నిద్రలో) హాతండ్రీ ! ధ్రువసింధుమహారాజా ! నీపట్టపు దేవి గర్భమున జన్మించుటచేత నేగదా ! నాకిట్టికష్టములు లభించుట సోదరప్రేమవిడిచి శత్రుజిత్తు నన్నుజంపింప యత్నించుటయా ? కానిమ్ము ప్రతిఫలమనుభవింపకపోడు.

చిత్ర :—(సంతోషమున) దేవీ ! మనస్సంశయ నివృత్తి కలిగినది.

శశి :—అదెట్లు ?

చిత్ర :—అమ్మా ! ఈ సార్వభౌముని యుదంత మంతయు గ్రహించితిని. సావకాశముగా తెలిపెదను రమ్ము.

(చెయ్యిపట్టుకొని నడవ ప్రయత్నించును)

శశి :—చెలీ !

గీ. చంద్ర సందర్శనంబున ॥ చంద్రకాంత
మణి కఱంగినవిధము ! నీ ॥ మారసముని
సోయగము నాదు హృదయముల్ ॥ జూఱగొనియె
నిమ్మహాత్ముని విడిచి రా ॥ నెట్టులగును !

చిత్ర :—(తనలో) ఓహో! ఏ రాకుమారుల కవకాశమొసంగని ఈ శిరీషకుసుమగాత్రి హృదయస్థానమీ రాజకంఠీరవునకు సమర్పింప దృఢపరుచుకొన్నట్లున్నది. (ప్రకాశముగ) అమ్మా! మనమీ పురుషుని చెంతనుండుట ధర్మముగాదు! ప్రపంచమున లోకులేమను కొందురో? మనమిందు తడయరాదు. సౌధమునకేగుదమురమ్మ.

శశి :—ప్రేయసీ! జనులేమనుకొన్నను సరియె! నిస్సందేహముగా నాయభిప్రాయమును వెల్లడించెద వినుము.

చ. ప్రణయ సముద్రమీదుటకు బ్రహ్మవిధించెను నౌకభంగి యీ
మనసిజ సుందరాంగుని యత్యమానుషభక్తిని పూజసల్పి నే
జననము గాంచినందులకు సార్థకమొందెద తల్లిదండ్రు లిం
పున గనులారజూడగ న మోఘ యశంబు లభింప ధారుణిన్

చిత్ర :—(నవ్వుచు) ఓహో! అదియా నీకోరిక. అటులైన ఇమ్మహాత్ముని మేల్కొల్పుమనా?

శశి :—వలదు. నిద్రాభంగమగును.

చిత్ర :—ఐన మనకిప్పుడేది కర్తవ్యము?

శశి :—ఈమనోహరమూర్తి నిద్రదేఱువరకిట నుండుటయే!

చిత్ర :—రాకుమారీ! పొరపడుచుంటివి. తరుణులు తమంతట తామే వలచి వచ్చినచో పురుషులకు చులుకనగును.

శశి :—చిత్రభాషిణీ! నన్నిప్పుడేమిసేయుమందువు?

చిత్ర:—చేయుటకేమున్నది. యంతఃపురముజేరి మాతాపితృలకు నిజాభిమతము వెల్లడించి మనస్ఫూర్తిగా వరించిన పురుషపుంగవుని సగౌరవముతో రావించి కరగ్రహణ మాచరించుటే యుక్తమని నాయభిప్రాయము.

శశి :—కాలవిళంబమునకు ఆర్యపుత్రుడు పునఃప్రయాణమునకు సిద్ధపడకుండునా?

చిత్ర:—అందులకే తొందరపడవలయును.

శశి :—మంచిది నీయిష్టమెట్లో యటే కానిమ్మ,

(ఇరువురు నిష్క్రమింతురు)

9–వ రంగము

(సౌధమున సుబాహువు చిత్రసేన ప్రవేశింతురు)

చిత్ర :—నాథా! అయ్యమ్మాయికి తగిన సంబంధము లభింపలేదా? దేశము గొడ్డుబోయినదా యేమి?

సుబా :—సుందరీ! నన్నేమిసేయమందువు! ఎందఱెందఱి చిత్రపటంబులనో దెప్పించి నిష్ఫలమనోరథుడనైతిని భూపాలకు లెందఱో మనతో వియ్యమందుట కువ్విళ్ళూరుచుండిరి. సామంత ప్రభృతి చక్రవర్తుల పరియంతయు వెతకి వేసారితినిగాని యొకరినైన మన సార వరింపని బిడ్డ యవివేకమున కేమన వలయును.

చిత్ర :—దాని పెంకెతనమున కేమిలెండు ఏదో తగిన సంబంధము మీరే నిశ్చయింపుడు లేకున్న సాటివారిలో పరిహాసపాత్రుల మగుదుము అమ్మాయిని నేనెట్లో యొప్పించి మెప్పించెదను.

సుబా :—మనోహరీ! ప్రస్తుతమది యేవిచారించి స్వయంవరము సాటింప జేసితిని మనశశి తనయిష్టమగు పురుషుని వరింపవచ్చును (ముందుకు పరికించి) అదిగో! సమయమునకే, శశికళవచ్చుచున్నది.

(శశికళ చిత్రభాషిణి ప్రవేశింతురు)

శశి :—(సంతోషమున) జననీజనకులకభివాదనములు (నమస్కరించును)

సుబా :—శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు.

చిత్ర :—అమ్మా! శశీ, ఇటురమ్ము నా అంకపీఠ మలంకరింపుము.

శశి :—చిత్తము (తల్లితొడపై కూర్చుండును)

చిత్ర :—అమ్మాయీ! నీవైవాహికము కండ్లపండువుగా మేముచూచు భాగ్యము నోచుకొనలేదా?

శశి :—(సిగ్గుతో) లేకేమి!

చిత్ర :—ఎప్పుడు?

సుబా :—(ఇంచుకకోపమున) శశికళా! నీమాటలింక చాలింపుము. దేశదేశంబులందు నీస్వయంవరము సాటింపజేసెదను నీవంగీకరించినను అంగీకరింపకున్నను స్వయంవరమున కరుదెంచిన వారియం దొకనికి నిన్నొసంగి పరిణయోత్సవ మాచరింపకతప్పదు బాగుగా ఆలోచించుకొనుము.

చిత్రభా :—(ఆతురతతో) మహాప్రభూ! అనుగ్రహముడిగి యవధరింపుడు మనపురి పరిసరోద్యానవనమున అయోధ్యాధిపుండగు ధ్రువసింధు సార్వభౌముని పట్టమహిషి తనూభవుండగు సుదర్శనుండు నిద్రింపుచుండెను. విహారమున కరిగి మేమతని సందర్శించితిమి! ఆ సౌందర్యమూర్తి లావణ్యా మీసుందరీమణి హృదయము నాకర్షించెను!

చిత్రసే :—(ఆశ్చర్యమున) ఆ! ఆరాకుమారుని శత్రుజిత్తు చంపించినాడని విని యుంటిమిగదా!

సుబా :—ఔనంతియేకాదు కాలనేమి బారిందప్పించుకొన్న ఆవీర సింహుని తిరిగి వధించుటకు యుధాజిత్తు ప్రబల సంఖ్యాకంబులగు సైనికులతో పర్వతారణ్యములు మునిజనాశ్రమస్థలములు వెతుకుచున్నట్లు తెలిసినది. ఆతడొకవేళ బ్రతికియున్నను మరణించినవాడనియే భావింపవలయు.

చిత్రసే :—ఏమది? అట్లనుచుంటిరి?

సుబా :—నిఖిలరాజన్యుల నేత్రమున సార్వభౌమపదవికి పట్టభద్రుడై శత్రుజిత్తు దయాదాక్షిణ్యరహితుడై వర్తింపుచుండెను యుధాజిత్తు నిరవశేషముగా శత్రునిర్మూలన మొనర్చి పౌత్రునియధికార మభివృద్ధి జేయుటకు బద్ధకంకణుడై యుండెను ఆకారణమున నిరాధారుడగు సుదర్శనుని జీవనమువ్యర్థమనుటకు సందేహము లేదు!

శశి :—తండ్రీ! వృద్ధిక్షయంబులు జయాపజయంబులు ఈశ్వరస్వాధీనములు అందులకు విచారింపజెల్లదు "దిక్కులేనివారలకు దేవుడే

దిక్కనుట" మిథ్యాస్పదమగునా? దైవసంకల్పమున సేవకుడే రాజగును రాజే సేవకుడగును?

మ. ఇపుడీరీతి నరణ్యసీమలను దా నేకాకియై యుండు వా
డు ప్రతాపంబునవైరులన్ దునిమి తో డున్నీడయున్నట్టి భూ
మిపుడై సర్వనృపాలకుల్ గొలువ భూ మిన్ బాలనన్జేయుడే
నృపకంఠీరవ!నాకతండె విభుడు న్ర్వీమాట లింకేటికిన్.

జనకా! సూర్యచంద్రాదుల సాక్షిగా నామనస్సింహాసనంబునం దా దివ్యమూర్తి నధిష్ఠింపజేసితిని ఆపుణ్యపురుషునకు నాహృదయ ధనమును కానుకగా సమర్పించితిని!

చిత్రసే :—ఓసీవెఱ్ఱిదాన; కోరక కోరక నెట్టివానిగోరితివే

మ. కరులున్ రత్నములున్ దురంగములుభోగశ్రీలు రాజ్యంబు లే
కరయన్ శత్రుభయంబుచే విపినమార్గానన్ బ్రవర్తించు యీ
నిరుపేదన్వరియింపమేలుగలదే నిక్కంబు యోచించి యే
ధరణీశాగ్రణినో వరించి సుఖమొందన్ జూడుమోతల్లిరో?

శశి :—అమ్మా! జలబుద్బుదములవంటి భోగభాగ్యంబుల నపేక్షించి పవిత్రమగుహృదయమును కళంకమొనరించుటకన్న హీనమొండు గలదా? (విచారముతో తలవంచుకొనును)

చిత్ర :—దేవీ! దేవులారా! వృథా మీరేలశ్రమ నొందెదరు ఆవీరపురుషుని కళాతీతము చూచినచో తప్పక చక్రవర్తి స్థానమలంకరించుననితోచెడు ఒక వేళస్వీయరాజ్యపదవి సిద్ధింపకున్నను తమకుజామాతయగుటకు సమ్మతించెనేని "తీగెకుకాయబరువగునా?"

సుబా :—చిత్రభాషిణీ మేలు మేలు నీయాలోచనము సమంజసముగానున్నది. (భార్యనుచూచి) మనోహరీ మనమింకసందేహింప నవసరములేదు విధివైపరీత్యమున సకలభూపాల శిరఃకిరీట ఘటితమాణిక్యనీరాజితాంఘ్రి కమలుండగు సార్వభౌముడు కాకుండినను మన రాజ్యమున కధిపతిని గావింతును గాక!

చిత్ర :—మహాభాగా తమసంకల్పమున కన్యథాయుండునా?

చిత్రభా :—ఏలినవారికి సర్వము సమక్షమున విశదమగును ముం దా రాకుమారుని పురప్రవేశమాచరింపుము ఆలసించిన కార్యాంతరాయమగును.

సుబా :—మంచిది మీరికపూజాద్రవ్యంబు లాయత్తపరిచి సువాసినీజనుల నెదుర్కొన సిద్ధమొనర్పుడు నేనిదే సకలసన్నాహంబులతో సుదర్శనుని సందర్శించెద.

చిత్ర :—మహాప్రసాదము అట్లేకానిండు (శశికళనుచూచి) కుమారీ! మనోవాంఛాఫలసిద్ధిజెందిన నీవెంతయు ధన్యురాలవు చిత్రభాషిణీ మనములోని కరుగుదమా?

చిత్ర :—చిత్తము! (అందఱు నిష్క్రమింతురు)

తృతీయాంకము సమాప్తము



ఓమ్




## చతుర్థాంకము

### 1 రంగము

(తోటలో సుదర్శనుడు మేల్కాని లేచి తనలో) ఆహా! ఏమీ నిద్రావస్థ ప్రపంచభ్రాంతి లేకుండ మైమరపుకలిగినదే! (అంతట కలయజూచి) అదిగో! సాంధ్యరాగము. నలుదిశలు వ్యాపించినది పక్షులు తమతమకులాయనముల వెతుకుచున్నవి పశ్చిమేతరదిశలందు గాఢాంధకార మావరింపుచున్నది గాఢనిద్రవలన ప్రొద్దుగు రైతుంగ నైతిని (ఆలోచించి) ఓహో చూచుచుండగనే గగనమండలంబున దారకలొక్కటొక్కటి బిక్కటిల్లుచు మార్గస్థులకు దారిగాన్పింప కున్నది నేటికిపట్టణంబున తలదాచుకొని వేకువఝామున తిరిగిప్రయాణమాచరింపవలయును (మెల్లగానడుచుచు వినుటభినయించి) ఏమిదీ సవ్వడి! ఈ! ఆరామముఖద్వారముచెంత భేరీ కాహళమృదంగ పటహ ఢక్కాది మంగళారావంబులేగాకుండ సేనానివహంబులకోలాహలము వినవచ్చెడు నేమైయుండుచెప్పుమా! దురాత్ములగుయుధాజిత్తు శత్రుజిత్తులునన్నొంటిగా బంధించి తిరిగి సంహరింప వచ్చుటలేదుకదా! (ఆలోచించి) మంచిది. రానిమ్ము మదీయకోదండనిర్ముక్త శరప్రకాండముల నిగుడించి వారిగుండెలు జీల్చి జెండాడెదనుగాక.

సుబా:— చిత్రభాషిణి వచించినసాంకేతస్థలమదియే (ప్రకాశముగా) భటులారా! సుదర్శనుడెందుండెనో బాగుగాపరిశీలింపుడు!

సుద :—(తనలో) ఓహో ! ఇక్కడికి నా యనుమానము దృఢపడినది (కోపమువహించి) ఓరీ ! సోదర ద్రోహీ ! నీదురాలోచనలింక సాగ వనిదలంపుము.

ఉ. బాలుడనంచు నెంచకను । పాపపుబుద్ధిని నన్నుజంప దు
శ్శీలునకప్పగింపనటు । జిక్కకనుండు టెఱింగి క్రూరతన్
బాలిశ ! నేడునన్నిచట । బట్టి వధింపగ నెంచునిన్ను ని
ర్మూలమొనర్తు రమ్మిపుడె । భూరిభయంకర బాణపంక్తులన్

(బాణముసంధించి ముందుకునడుచుచుండుచు)

సుబా :—ఓహో ! ఇమ్మహాధనుర్ధరుడే కాబోలు సుదర్శనుడు నన్ను విరోధిగా దలంచి ప్రళయకాలరుద్రునివలె వీరరసావేశంబున నిటే రాదొడంగెను (ప్రకాశముగ) ఓ సార్వభౌమకుమారా ! నీకునేను శత్రుండనుగాను నీస్నేహమపేక్షించు నీవురాధిపుడ సుబాహు నామధేయుడను నీశుభముఁగోరివచ్చితి కోపముపసంహరింపుము! ఉపసంహరింపుము !! (సుదర్శనుని సమీపించును)

సుద :—మహాత్మా ! నాశాత్రవు డనుకొని త్వరపడితిని నాయపరాధ మునుక్షమింతురుగాక. (నమస్కరించును)

సుబా :—ఆయుష్మంతుడా ! ఇందునీయపరాధమేమున్నది ? నీవిధ్యుక్త ధర్మమనుసరింపబూనుకొంటివి (కౌగిలించుకొనును)

సుద :—అయ్యా ! తమకీదీనునియందు కలిగిన నిర్హేతుకజాయమాన కటాక్షమునకు కారణమడుగవచ్చునా ?

సుబా :—కారణములు రెండుగలవు.

సుద :—ఆకారణము లెట్టివో నెఱింగింతురా ?

సుబా :—సకలరాజపుంగవులచే కప్పములు స్వీకరించు సార్వభౌముని కుమారుండవగుటొకటి రెండవదిసావధానమనంబున చిత్తగింపుము

మ. చతురంభోనిధిమేఖలాఖిలమహీ । చక్రంబుపాలించు భూ
పతులం దెవ్వని గోరనట్టిసుత సం । భావించె నీహస్తమూ

ర్జితభక్తిన్గాన, నందుచే సుగుణరాశీ? నాకుజామాతవై
క్షితిబాలింపుము మత్సుతా తిలకము న్జేపట్టి సౌఖ్యంబుగన్.

సుద :—(సంశయముతో) ఆర్యా! తమకోరిక నిరర్థక మగునేమోయని తలంచెద నేమందురా?

మ. ధనధాన్యంబులు భోగభాగ్యములు భృత్యామాత్యులున్ రాజ్యపా
లనమున్ దల్లినిగోలుపోయితి నృపాలా? భాగ్యహీనుండ నన్
గొనిమీపుత్రిసుఖంబు జెందగలదే? క్షోణీశ మద్ధాంతికా
జనసంసేవిత వేదమైనపతి విశ్వాసంబు శంకింపదే?.

ప్రబలవిరోధులమధ్యస్థానమున నిల్వజాలక ప్రాణసంరక్షణార్థమరణ్యస్థలములగ్రుమ్మరిలుచుండు నిఱుపేదనగు నేనెక్కడ? నిరంతర దాసదాసీజనపరివృతాఖండలవైభవాభిరామయగు భవత్కుమారీతిలకంబు నన్ను జేపట్టిసుఖించు టెక్కడ!

సుబా :—నాయనా! నా దుహితనొసంగుటేగాదు నా రాజ్యలక్ష్మిని కూడా పరిగ్రహించి సకలసౌఖ్యములనోలలాడుట కనుగ్రహింపుము

సుద :—(సక్రోధమున) ఆ! ఏమది? పౌరుషప్రతాపశక్తిహీనుడై భార్యామూలార్జిత రాజ్యశ్రీ లనుభవించుటకు యుత్తమక్షత్రియాన్వయు డంగీకరించునా?

సుబా :—(సుదర్శనుని చేతులు పట్టుకొని) ఆయుష్మంతుడా! నీకట్టి సంశయమక్కరలేదు. నారాజ్యమున కేలికవై వలయు రథ, గజ తురగ, పదాతి సకలసైన్యంబులగూడి విజయభేరీ భాంకారంబు లుప్పరంబెగయ నయోధ్యాపురంబు ముట్టడించి.

మ. ధరిణిన్ బాహుబలంబుజూపి రిపులన్ దండించి వంశీయభూ
భరమున్దాల్పుమఖండవైభవమునన్ బాలింపుమీరాష్ట్రమా
దరణీయంబుగ సంశయింపకను సత్యస్ఫూర్తినే బల్కితిన్
పరమప్రీతిని నాయభీష్టమును దీర్పన్ బూను మిప్పట్టునన్

బహువిధసమర్థుండవై, నీవీ రెండు రాజ్యంబులేకచ్ఛత్రంబుగా బరిపాలింపుచు నన్నానందింపజేయుము.

సుద :—(తనలో) నిరాధారుడనగు, నాకిప్పుడు మహేశ్వరీ యనుగ్రహ విశేషంబున ఈనృపకంఠీరవుండు తనదండ జూపుచుండ నిరాకరించుట ధర్మముగాదు. లోకేశ్వరి కటాక్షముంచునేని శత్రుని రసన మొనర్చి స్వీయరాజ్యపదవి జేపట్టలేకుందునా? (ప్రకాశముగా) రాజేంద్రా! పూజ్యులగు తమయాజ్ఞ శిరసావహింతుగాక.

సుబా :—నాయనా! సుదర్శనా, నగరంబునకు దయచేయుము.

సుద :— (స్వగతము) ఆహా! ఈశ్వరచిద్విలాసము వర్ణనీయము. (ప్రకాశముగ) మహాప్రసాదము!

(అందఱు నిష్క్రమింతురు)

2–వ రంగము

(అయోధ్యానగరమున యుధా-శత్రు ప్రవేశింతురు)

యు :—కుమారా! మోసము! మోసము!!

శత్రు :—తాతా! ఆదుష్టచిత్తుడు తనకూతురు స్వయంవర ముహూర్త శుభలేఖలు సకలదేశాధీశ్వరులకంపి కన్యాగ్రామి రాజలోకమునకందఱికి దలవంపులు ఘటింపజేసి సార్వభౌముండనగునాకు తీరని పరాభవ మొదవించి నాకాగర్భశాత్రవుండగు సుదర్శనుని రావించి వివాహ మొనర్చుట కన్న యింక ద్రోహమేమి సేయవలయును.

యు :—కుమారా! విచారింపవలదు ఆమామనల్లుండ్ల కిప్పటికి శతాయుర్దాయము నిండినదని భావింపుము!

శత్రు :—మాతామహా; మరచితిని మనమింతవరకు చేసిన కార్యములన్నియు నిరర్థకములగుచున్నవి! నాజన్మవిరోధి చావక బ్రతికియుండుటేగాకుండ!

చ. చెఱనిడినట్టి మంత్రి బహు ♦ చిత్రముగన్ భటకోటికెల్లక
న్నుఱుగునదప్పిపోయె! కడు ♦ మాయలమారిదలంచిచూడ దు
ర్భరుడగు నాతనిన్మరల ♦ బట్టుటకారయజిక్కడయ్యె! ని
త్తఱిని ప్రమాదమేదియొ యు ♦ ధావిధి నబ్బునటంచు దోచెడున్,

సర్వశక్తి సమర్థుడగు ధీమంతుడు దెబ్బతప్పిన బెబ్బులివలె హుంకరింపుచు పూర్వవిరోధము కారణముగానెంచి నాకేలాటి యాపదకలిగించునోయని నాహృదయము తహతహపడుచున్నది ?

యు :—వత్సా! ఏమంటివి ?

మ. చతురంభోధిపరీత భూవలయ రాజ్యంబేలు నీ వేడ? దీ
నతచే కుల్లి కృశించి కాననములో నక్కడాగి స్వప్రాణర
క్షితుడైనట్టి యమాత్యుడేడ? దలపన్ జిత్రంబు నీమీది కు
ద్ధతుడై వచ్చుటకల్ల; స్వప్నగత వృత్తాంతంబు చందంబగున్.

నీయనివార్యశక్తి సామర్థ్యంబులకు భయపడి కాలుకు బుద్ధి చెప్పి తప్పించుకొన్నవాడు తిరిగి నీపై కత్తి బట్టుటకు సాహసించునా! వృథాచిత్తభ్రాంతివదలి ధైర్యము వహింపుము ఆసుదర్శన సుబాహు ధీమంతుల నెదిరించి సంహరింప నిప్పుడు ప్రబలకారణ మొకటి సిద్ధించినదికదా!

శత్రు:—ఏమిటా కారణము!

యు :—కన్యాస్వయంవరమునకు నాహ్వాన పత్రములంపి పరాభవించుటయే!

శత్రు :—ఐన మనమిప్పుడేమి చేయగలము?

యు :—చేయునదియా!

చ. ఇలగలరాజశేఖరుల కెల్ల రయంబున బిల్వనంపి యా
తులువ సుబాహుపైన పగకద్దగ నెంతయు ప్రోత్సహించి సే
నల బుకిలొల్పి శాత్రవ జనంబుల రూపడగింపగావలెన్
బలరిపుడాది దేవతలు వైకొనివచ్చిన భీతిజెందకన్.

చిరంజీవీ! అభిమానధనులగు వారెల్లరు తప్పకనిందుల కంగీకరింపక మానరు వేయేల? సుదర్శనాధముని ధర్మ విరుద్ధముగా దెగటార్చినారను యపఖ్యాతిలేకుండ సంగ్రామ రంగము నందా నీచుని యుత్తమాంగము దుత్తునియలుగావించుటకు సంశయము లేదు!

శత్రు :—తాతా! సత్యము! సత్యము!! సుదర్శనమాతా మహుండగు వీరసేనుడు తనచతురంగబలములతో పౌత్రునకు బాసటయగును. సుబాహు ధీమంతులు యథోచితముగా సహాయపడుదురు. పోరు ఘోరంబుగా సిద్ధపడునని దోచెడు.

యు :—ఔను! తత్కారణంబున నీయభిమత మీడేరగలదు.

గీ. తనకు సాహాయ్యముగనిల్చు కె తాత మామ
మంత్రి బలగంబు దా, నిల కె క్రమ్మందగలరు
సంశయములేదు నిశ్చింత కె సార్వభౌమ
పదవి కర్హుండవై సౌఖ్య కె పడుదువీవు.

శత్రు:—కృతార్థుడను! కృతార్థుడను!! ఇప్పటికి మీయూహ మిక్కిలి సమంజసముగా నున్నది!

యు :—కుమారా! మనమింకాలసింపరాదు. త్వరలో తత్కార్య భారము నిర్వహింపవలయును రమ్ము!

శత్రు :—మహాప్రసాదము. (ఇరువురు నిష్క్రమింతురు)

3-వ రంగము

(యుద్యానవనమున సుదర్శనుడు, శశికళ మల్లెచెట్టుక్రింద విచారమున మనోరమ ప్రవేశింతురు)

సుద :—ప్రేయసీ! నీ నిర్మల ప్రణయజలధి తరంగడోలికల నూయలు లూగు నాహృదయమున కేదియో విచారము స్ఫురింపుచున్నది.

శశి :—ఆర్యపుత్రా! నిష్కళంక ప్రేమమయులగు తమకు నాయందల వడిన బద్ధానురాగసౌజన్యమే నాకుపెన్నిధి! అదియే నాజీవితము నకుసార్థకము! అదియే నాసౌభాగ్యమున కాధారము మనోహరా! పెక్కుమాటలేల! మీ సుందర వదనారవింద సందర్శనమే నిఖిల భోగభాగ్యముల కాటపట్టుగా దలంచెదను.

మనో :—హా! పరమేశ్వరా! దీనాతిదీననై కంటికి మంటికి నేకధారగానేడ్చు నామొరాలకించి నన్ను రక్షించు దయామయులెవ

లేరా? శరణాగతత్రాణ బిరుదాంకితుడవగు నీకింతటి నిగ్రహపాత్రురాలనైతినా?

సుద :—(వినుట నభినయించి) సుందరీ! ఈ సమీపమం దెవ్వరో యనాథ పాపము దుఃఖింపుచున్నది వింటివా?

శశి :—ఔను. (ఇరువురు ముందుకునడచివినుచుందురు)

మనో :—హా! దీనబంధూ! నీకంటి కీదార్భాగ్యురాలే కనుపించెనా తండ్రీ!

గీ. అగ్నిసాక్షిగ కరమందికొనట్టి భర్త
మరణమొందగ వెంటనే ॥ మామకీయ
దేహమును వీడి జీవముల్ ॥ దివికి జేర
కుండె నాబ్రతు కెంతటి ॥ మొండిదార!

శశి :—నాథా! పాప మాయువతి యెవ్వరోగాని పతివియోగ దుఃఖమున గ్రుంగి కృశింపుచున్నట్లు ఆయమ దీనాలాపమున దృఢమగుచున్నది.

సుద :—కోమలీ! సత్యము గ్రహించితివి. ఆదీనహృదయ పలుకులు విన్నచో ఎంత రాతిగుండెవానికైన కనికరము గల్గక మానదు. అదిగో! మరల నేదియో బెరొల్లనుచున్నదాలకింపుము.

శశి :—చిత్తము. (ఇరువురు వినుట నభినయింతురు)

మనో :—హా! దీనశరణ్యా! భర్తృవియోగ సంతాపాగ్నిజ్వాలలన్ బడితపించు నాకు బుత్రునొకని, యాధారముజూపితివని సంతసింపుచునుంటినే! అయ్యో! భగవంతుడా! నాఆశాలతను పురాకృత కర్మఖడ్గమున ద్రెంచివైచితివే?

చ. అడవుల బల్లెలన్ బురము ॥ లందున దుర్గమశైలపంక్తులన్
దొడరినకష్టము ల్గడకు ॥ ద్రోయుచు రేయి బగల్భరించినన్
గొడుకెటగానరాడు పసి ॥ కూన సుఖంబుగనుండెనో ? దురా
త్ముడుపగవాడు శాత్రవజి ॥ తుండు వధించెనో? యేమి శేయుదున్

సుద :—(తొందరతో) మనోహరీ! అయస్కమాట లెంచుమించుగా నాచరిత్రమున కన్వయించుచున్నవి! సమీపించి వీక్షింతము రమ్ము. (నడువయత్నించును)

శశి :—(సుదర్శనుని చెయ్యిపట్టుకొని) ఆర్యా! భ్రమపడుచుంటిరి భూమండలమునందిట్టి దురవస్థలకు జిక్కిన వ్యక్తులెందఱు లేకుండిరి! ఐన నింకేమనుకొనునో గ్రహించి మీదటికార్యమాలో చింపుడు. (ఇరువురువినుచుందురు)

మనో :—హా! ధ్రువసింధుమహారాజ సార్వభౌమా! మీరా నా డవసానకాలంబున ధీమంతునితో సపత్నీదూషితనగు నాముద్దు బిడ్డని పట్టభద్రునిగాఁజేయుమనియేల సెలవిచ్చితిరి! చెప్పిననేమి? స్వామి కార్యనిర్వాహకు డగు మంత్రిసత్తముఁడందులకేల యంగీక రింపవలయును అంగీకరించుటవల్లనే గదా! ఇప్పుడీ కష్టముల పాలగుట? హా! కుమారా! సుదర్శనా! నీవు నాకంటికిగాన్పింప కున్నచో నాకీప్రపంచమేల? నాకీజీవితాశయేల? తండ్రీ! నీవెన్న టికైనను గనుపింతువుగదాయని ఇంతవరకు దినమొకయుగముగా కాలము వెళ్ళబుచ్చితిని కుమారా! నాకింకమరణమే శరణ్యమా! హా! సుదర్శనా! హతోస్మి! హతోస్మి!! (మూర్ఛిల్లును)

సుద :—తల్లీ! ఆగుమాగుము!! ప్రాణత్యాగమునకుసాహసింపకుము

(శశికళతోతల్లినిసమీపించి శైత్యోపచారములు జేయుచుండును)

మనో :—(ఆయాసమునయించుక కదులుచు) నాయనా! నీవెవ్వరో గాని హతాశనగు నన్నేల బ్రతికింపప్రయత్నింతువు. వేయుజన్మ ములకైన నీరుణముతీర్చుకోగలనాతండ్రీ! (తిరిగికనులుమూయును)

సుద :—(విచారమున) నేనన్యుఁడనుగాను! తల్లీ! నన్నొక్కసారి విలోకింపుము.

మ. జననీ! నిన్నెడబాపి వన్నడివిలో జంపన్ బ్రయత్నించు దు
ర్జనుబారిన్ బడకుండ దీనికరుణన్ సంరక్షుణాజ్ఞింది శా

త్ర్రనితానంబుగణించి యీతరుణి హా కే స్తంబంటి నీదర్శనం
బునకై చింతిలుచుండు బుత్రకుని త కే ప్పల్ ద్రోసిమన్నింపుమా

మాతా ! నన్నింతకాలమెడబాసి ఘోరయిడుములపాల్జేసిన యీదుర్మార్గుని, యపరాధంబులుమన్నింపుము ! (కాళ్ళపై బడును)

మనో :—(ఇంచుక లేచి) ఆ ! నీవుమాసుదర్శనుడవేనా ? తండ్రీ ! నిజము చెప్పు నిజము చెప్పవు ? (తిరిగికనులుమూసుకొనును)

సుద :—అమా ! ముమ్మాటికి నీకుమారుడనే ! కనులువిప్పి నన్నొకమారు పరిశీలింపుము ! (చేయూతగా లేవనెత్తును)

మనో :—(తేటిపారజూచి) ఆ ! మానాయన సుదర్శనుడే ? ఎంత సంతోషము ! ఎంతసంతోషము !! (కౌగిలించుకొని) నాతండ్రీ ! నిన్నెంతకాలమునకు కనులారచూడగంటినిరా ! (తొడపై కూర్చుండబెట్టుకొని)

మ. తొలిజన్మంబునజేసినట్టి వ్రతమెం కే తో నేడుసిద్ధించె ని
శ్చలసంతోషసుఖావహంబౌదవె ! వ కే త్సా ! నిన్నువీక్షింప చిం
తలుబాసెన్ పరమాద్భుతంబు హృదయ కే స్థానంబునన్నిల్చె కో
ర్కెలుదీరెన్ సమకూరె సర్వశుభముల్ కే బృద్ధిన్ గుమారోత్తమా.

నాయట్లారుముద్దులయ్యా ! నిన్నీలోకమున దిరిగి జూతునని యాశలేని నన్నాపరమేశ్వరు డనుగ్రహించినాడు ఇప్పటికి మనము ధన్యులమైతిమితండ్రీ!

శశి :—పరమసాధ్వీమ తల్లులగు అత్తగారి కభివందనములు: (నమస్కరించును)

మనో :—దీర్ఘసుమంగలీభవ! దీర్ఘసుమంగలీభవ!! బిడ్డా! నీవీయుంక మలంకరించి నాకానందము గూర్పుము!

శశి :—చిత్తము (మనోరమచెంత సుదర్శన శశికళలు గూర్చుందురు)

మనో :—ఆహా; నాభాగ్యమే మని కొనియాడవలయును!

మ. కొడుకున్ గోడలు గూడియుండగను నాకున్ జూచుభాగ్యంబునే
ర్పడె; కష్టంబులు సర్వమున్దొలగి పోవన్ గల్గె దోర్వీర్య మే
ర్పడ స్వారాజ్యము గెల్చి పుత్రుఁడరి దర్పంబెల్ల బోకార్చి న
ష్టము నా ప్రీతికి మేరలేక దలవంపుల్బాసి వర్తించెదన్.

సుద :—తల్లీ; మనమంతఃపురము జేరి శ్రమనివారించిన పిమ్మట జరిగిన వృత్తాంతమంతయు విన్నవించెదను రమ్మా.

మనో :—కుమారా! నీవు కంటబడినప్పుడే నా శ్రమలన్నియు నిర్మూలముగా అంతరించినవి ఐన నీయిష్టమెట్లో యట్లే కానిమ్మా!

సుద :—జననీ! దయచేయుము! ప్రేయసీరమ్మా!

(అందఱు నిష్క్రమింతురు)

4–వ రంగము

(రహస్యమందిరమున వీరసేనుడు ధీమంతుడు ప్రవేశము)

వీర :—ధీమంతా మాత్యపుంగవా; గతించినదానికి చింతించిన ఫలము లేదు నాదౌహిత్రుడగు సుదర్శనుడు వైరికంటబడకుండ సంరక్షితుడై కాశీనగరాధిపుని కూతురు శశికళను వివాహమాడి అర్ధాంగలక్ష్మితోపాటు తద్రాజ్యలక్ష్మిని పరిగ్రహించినట్లు గూఢచారులచే వినియుంటిని.

ధీమం :—రాజేంద్రా; పరమానందకరమగు శుభవార్త విన్నందులకు మనమెంతయు ధన్యులము.

వీర :—ధీమంతా; ఎక్కడిధన్యత; ఎక్కడియానందము.

ధీమం :—ఇంక విచారింప కారణమేమి?

వీర :—క్రూరమానసుల కేమికారణముండవలయును.

ఉ. పౌత్రుడు కాశికాపురి సుబాహుసుతన్ వరియించి వేడుకన్
ధాత్రినియేలుటల్విని, యుధాజితునాజ్ఞబురస్కరించి సు
క్షత్రియ వర్యులన్ దమకు సాయమువచ్చుటకై విధింపుచున్

శత్రుజితుండు పోరునకు ర సత్త్వరుడై జనుజాడవింటి నో
మిత్రమ! మత్సుదర్శనుని రమేలెటు జూతుము నింక మీదటన్.

రాజన్యుల స్వయంవరమున కాహ్వానించి యెవరికి దెలియకుండ సుబాహు దనపుత్రిని సుదర్శనున కొసంగినాడను నెపంబొకటి స్థిరపరచి కాశీనగరంబుపై దండెత్తిన సమరమున కతుదెంచు మామ నల్లుండ్ల దెగటార్పవలయుననని, నిశ్చయించుటవింటిని.

ధీమం :—మహారాజా; అట్లైనచో ఆలసింపరాదు త్వరలో యీ వార్తను కాశీపతి కెఱుగపరచి మనము చతురంగ బలములతో యుద్ధమునకు సన్నద్ధులమై కుమార ప్రభునకు తోడ్పడవలయును. కాలయాపనము ప్రమాదమునకు దారితీయును లెండు త్వరపడుడు.

వీర :—ధీమంతా! సంతోషము! సంతోషము!! కర్తవ్యమెఱింగించితివి నీయభిమతప్రకారమే యాచరించెదను. సేవకా! సేవకా!!

(భటుడుప్రవేశించి) మహాప్రభూ! ఏమిసెలవు.

వీర :—సేవకా! ముందు కాశీనగరమున కతిత్వరలో జనుసమర్థుడగు నాశ్వికుని నాచెంతకు రప్పింపుము. మరియు, రథ, గజ, తురగ, పదాతి, చతుర్విధ సైన్యంబులతో సమరంబునకు సిద్ధపడునట్లు సర్వసేనాపతికి నా శాసన మెఱింగింపుము. నీవికపొమ్ము.

భటు :—మహాప్రసాదమట్లే నిర్వర్తించెదను. (నిష్క్రమించును)

ధీమం :—భూపురందరా! విధి విధానమెంతలో నేవిధముగా పరిణమించి రక్తపాతమునకు ప్రజానాశనమునకు మార్గము దీయుచున్నదో చూచితిరా?

వీర :— ఔను! దయాదాక్షిణ్య రహితులగు క్రూరచిత్తుల తలంపుల కవధియుండునా?

ధీమం :—కానిండు! తత్పాప ఫలంబిప్పు డనుభవింపకపోరు. ధర్మమే జయంబగును.

వీర :—అమాత్యశేఖరా! నాక్రమము మహారాజోచితము రమ్ము.

ధీమం :—చిత్తము (ఇరువురు నిష్క్రమింతురు)

౬-వ రంగము

(అంతఃపురమున మనో, సుద, శశి, ప్రవేశింతురు)

సుద :—తల్లీ! నీవు నాకొరకు ఘోరారణ్యములలో యెన్నెన్ని బాధలనుభవించితివో కదా? ఏకమగు యీ జన్మముననే గాదు. పదునాల్గు జన్మలందైనను దీర్చుకొనజాలను! దీర్చుకొనజాలను !!

శశి :—మహాభాగా ! సత్యము వచించితిరి. మాతృప్రేమ కొనియాడతగినది (నమాత్రుః పరదైవతంబనెడు) సామ్యములకే ప్రకాశింపుచు సర్వజనాదరణీయమైనది.

మనో :—తండ్రీ ! ఇహపరంబుల కాధారుడైన తనయునికొఱకు తల్లి దండ్రులెట్టి యవస్థలైనను భరింపక తప్పదు.

(సుబాహు విచారమున ప్రవేశించి)

సుబా :—నాయనా! ప్రమాదము! ప్రమాదము!! (అందఱు ఉలికిపడి లేతురు)

సుద :—ఏమి ప్రమాదము?

సుబా :—అబ్బాయీ సుదర్శనా! నీమాతామహుని చెంతనుండి యొకజాబువచ్చినది. ఈవిషయమందఱికి వినుపింపుము.

(ఉత్తరమిచ్చును)

సుద :—జాబు తీసుకొని)

శ్రీమన్మహారాజరాజాధిరాజ శ్రీ శ్రీ శ్రీ సుబాహు మహారాజశేఖరులవారి దివ్యసముఖమునకు :—తమ కాప్తబాంధవుడైన వీరసేనుడనేకవందనశతంబులర్పించి ఉ॥ క్షేమానంతరం వ్రాసుకొనునదేమన;— నాపుత్రి మనోరమను శ్రీ ధ్రువసింధుసార్వభౌమునకొసంగుటయు, ఆయమగర్భమందఖండ తేజోనిధి సుదర్శనుడావిర్భవించుటయుద్వితీయశశిత్ర

మైనలీలావతికుమారుడుశత్రుజిత్తుకాలధర్మమొందినజనకుని సింహాసన మధిష్ఠింప కుచ్ఛితప్రయత్నములొర్చి బుద్ధివిశారదుండగు ధీమంతుని కారాగృహమున బంధించి సుదర్శనుని బరిమార్పనడవులకు బట్టించుటయు పుత్రవియోగంబున మనోరమపురంబువిడిచి క్రూరమృగసంకులారణ్యంబులకేగుటయు తాముగ్రహించిన విషయమే! దైవానుగ్రహంబునజెరసాల దప్పించుకొని ధీమంతుడిచ్చటికిజేరెను నాడాహితృనకు తమరాశ్రయమొసంగి మీాతనూజనిచ్చి యుద్వాహమాచరించి పట్టాభిషిక్తునిజేయుట యుధాజిత్తు శత్రుజిత్తుల హృదయశూలమై సామంతరాజకుమారులసాయంబుగొని కరితురగబలసమన్వితులై సమరరంగంబున సుదర్శనపక్షపాతుల నిర్జింపవలయుననిదలంచి నానాదేశాధిపతులకుద్దండచండశాసనము విధించిరి. నేడో! రేపో! శత్రుదళంబులు మీాపురంబు ముట్టింపనుండిరి! ధీమంతాది సకలసైన్యంబుల గూడినేనరుదేరసిద్ధమగుచు ముందు తమకీపత్రికచే హెచ్చరింపుచుంటిని తాము సర్వసమర్థులు మీాప్రయత్నము నందప్రమత్తులై యుందురని ప్రార్థన!

(ఇట్లు విధేయుడు)
వీ ర సే ను డు,,

మనో :—(ఆతురతతో) అగ్రజా! శత్రుజిత్తు దుర్మార్గమున కింకేది కర్తవ్యము?

సుబా :—సర్వలోకారాధ్యమైన రత్నాకరంబున హాలాహలముదయించినట్లు ఈకుటిలచిత్తుడు మీావంశమున సంభవించినాడు నాయనా! సుదర్శనా! ఇప్పుడుఘోరరణము కానున్నది భూతలాధిపులందరు తమ తమబలంబులతో మనపైకెత్తివచ్చిన అల్పసంఖ్యాకులసేనలతో మనమావైరుల నెదిరించుటెట్లు? (విచారమభినయించుచు)

సుద :—దయామయా! మీారువిచారింపకుడు! విచారింపకుడు!!

గీ॥ వృశ్చికంబును భృంగము ॥ వేణు రంభ,
కర్కటంబులు నశియించు ॥ కాలమునకె

గొనును ఫలమును సుజన, దుర్జనులకెల్ల
యంతమున కేదియోగునా సంఘటించు

నిగ్రహానుగ్రహ సమర్థురాలగు భవానీదేవి యనుగ్రహమున్నంతవరకు మనకేయాపదలుసంభవింపవు ఆలోకజనని నాకుబాసటైయుండ శత్రుదళంబులు వేలకు వేలువచ్చి రణంబున నన్నెదిరించి నను ప్రాణభయార్తిని పరాజితులగుదురని భావింపుము నాప్రతిజ్ఞ వినుము !

గీ. సమరసీమను నను దాకి శత్రుదళము
లుండె నేసియు గుండెలన్ జెండి కాక
ఘూకముల కెంతయో విందు గూర్తుదృటిని
భయముజెందగ వలదింక పార్థివేంద్ర !

కాళీవరప్రసాదిత బాహుబలుండనగు నాకు ఈయల్పబల దర్పితులవలన భయ మావంతయు లేదు.

(తెరలో రణభేరులు మ్రోగును)

శశి :—(ఉలికిపడి) జీవితేశ్వరా! అదిగో? భూమ్యాకాశములు బ్రద్దలగునట్లు యుద్ధసన్నద్ధులగు యోధజనసింహనాదంబులతో పాటు రణభేరులు మ్రోగుచున్నవి. ఆర్యపుత్రా భేరీరవంబులేగావు! (కిందికినలుదిశలు కలయజూచి) గగనమండల మాక్రమించు కారుమబ్బులవలె వైరుల బలంబులు పురంబు నలుదిక్కుల ముట్టడింపుచుండిరి! అసంఖ్యాకంబుగా సైనికదళంబులు కొన్ని నగర పరిసరారణ్యమున నిండియున్నవి.

సుబా :—ఆయుష్మంతుడా! బలవద్విరోధమునకు నాహృదయము శంకింపుచున్నది.

సుద :—మహాత్మా! మీరావిషయమై విచారింపవలదు లోకమాతయగుదేవి ప్రసాదించిన వరము నిరర్థకముకాదు. తా మాలసింపక మన సైన్యంబుల నడిపింపుడు పొండు నేనిదే, కాళీసందర్శన మాచరించి రణోర్విని గలిసికొనియెద.

సుబా :—మంచిది త్వరపడవలయును! (నిష్క్రమించును)

మనో :—కుమారా! పసివాడవు నిస్సహాయుడవు శాత్రవులు మహా క్రూరులు దయా దాక్షిణ్య రహితులు తండోప తండములుగా సామంతులు కొందఱు వైరులకు బాసటయగుచుండిరి ఈసమయమున మన మెందేని తలదాచుకొని యుండకూడదా?

సుద :—(నవ్వుచు) తల్లీ ! ఎంతమాటాడితివి ? పుత్రప్రేమచే నిట్లు బల్కితివిగాని నిజముగా ఈసమయము వీరారిశిరః ఖండనోద్దండ పరాక్రమాభిరాముండనని జగద్విఖ్యాతి విజయములను పొందుట కిదియేశుభముహూర్తమగును (ఆలోచించి) కాలయాపనము కార్యవిఘాతమగును రండు పోవుదము.

మనో :—తండ్రీ ! నీయిష్టప్రకారమేకానిమ్ము ! (నిష్క్రమించి తిరిగి కాళికాలయమున-మనో-సుద-శశి- ప్రవేశింతురు)

సుద :—తల్లీ ! త్రిపురసుందరీ ! నీయమోఘాశీర్వచన ప్రభావముననే కదా ? నేనింతవరకు తలపువ్వువాడకుండ బ్రతికియుండుట ! నీ చల్లనికటాక్షవీక్షణ ప్రసారప్రాప్తిచేతనేగదా ? కళత్రరాజ్య శ్రీ లనుభవించుట !

మ. కరుణన్జూడుము కన్నపుత్రునివలెన్ ॥ గాపాడి దుర్వార దు
ర్భరవీరారిసమూహకంఠవిచల ॥ ద్రక్తప్రవాహంబులన్
బాఱలన్జేయగదమ్మ నీదుచరణాం ॥ భోజంబు లశ్రాంతమా
దరభక్తిన్భజియింతునమ్మ ! జననీ ! దాక్షాయణీ ! శాంకరీ !

మహేశ్వరీ ! దిక్కులేనివారలకు నీవేదిక్కగుదువనుట వృథాగావించి నీకీర్తికి కళంకమొదవింతువాతల్లీ

చ. సమరముసిద్ధమయ్యె రిపు ॥ సంఘములిప్పుడునన్నుదాకి వి
క్రమమున బోరనిల్చిరి జ ॥ గజ్జననీ ! భవదీయపాదప
ద్మములె శరణ్యమాననని ముకుందంబున నమ్మి భజించువాడ నే
క్రమమున బ్రోవనెంచెదవొ? ॥ ప్రాణభయంబుడిగించి నేడనిన్

భవానీ! దుర్వారగర్వాతిశయులగునైరిదళంబులు లెక్కకు మిక్కుటమైన నలుదిక్కులందు బిక్కటిల్లుచుండిరి? తల్లీ! నాజయాపజయంబులు నీ యధీనంబులు.

శా. బాలుండర్క కరిస్యంద నాశ్వభటకీర్ణస్వాన్యక్రమాటోప వి
ద్యాలావణ్యవిహీనుడార్తుడను యుద్ధస్థిత వీక్షింపగా
జాలన్ మున్నెవ్వడైన వైరిదళమున్ శాసింపగా నేర! నన్
బాలన్మించిన నీటముంచినను నీకభారంబె; కాత్యాయనీ.

మహిషాసురమర్దనీ, పాహిమాం! పాహిమాం! (నమస్కరించును)

మనో:—(చేతులు జోడించి) జగదంబా!

గీ. కఠినుడౌ శత్రుజిత్తుడు కరుణ దొఱగి
తమ్ముగుఱ్ఱను వధియింప దలచివచ్చె
దిక్కులేరెవ్వరును మాకు దిక్కు నీవ
కూర్మిరక్షింపు మాయమ్మ కొమరునిపుడు.

(నమస్కరించును)

శశి:—మాతా భక్తజన కల్పవృక్షరాజంబవగు నిన్నాశ్రయించిన వారికేయాపదలు రావనుచెరింగి నిరంతరము స్మరింపుచు, నీయడుగులబడు యీదీనుల మొరాలకించి సంరక్షింపుము! సంరక్షింపుము!!

చ. దయగనుమమ్మ నీదుప్రియదాసుని జేకొని తద్విరోధులన్
హయ రథ మత్తవారణ మహాభటకోటుల నాజిలోపలన్
లయ మొనరింపుచున్ విజయ లక్ష్మిని గూర్పగదమ్మ నీపద
ద్వయ మనిశమ్మునమ్మిన హితంబిడు దీవెగదమ్మ; శాంకరీ.

మహాగౌరీ! రక్షింపుము! రక్షింపుము!! (సాగిలిబడినమస్కరించును)

(కాళికాదేవి ప్రత్యక్షమగును)

కాళి:—బిడ్డలారా! లెండు! నన్నునమ్మిన భక్తుల మొరాలకించి వారియాపదలు నివారించి పాలించుటే నాకర్తవ్యము!

(అందఱు కాళినిచూచి తిరిగి నమస్కారము లొనర్తురు)

సుద :—మాతా! ధన్యుడను! ధన్యుడను!! (పాదములపై బడును)

కాళి :—(లేవనెత్తి) కుమారా! భయపడకు! సురాసురులు పదునాల్గు లోకములవారితోగూడి నీపై కెత్తి వచ్చినను భయములేదు! నేను నీయందుమూర్తీభవించి నీశత్రుసమూహంబును తెప్పపాటున సంహారింప సిద్ధముగానుంటిని వత్సా; నేను ప్రసాదించు దివ్య రథంబు నధిష్ఠించి అందుండు శస్త్రాస్త్ర కవచ కిరీటంబులు ధరించి సమరమునకాయత్తపడుము;

సుద :—(సంతోషమున) దేవీ! కృతార్థుడనైతిని! నీయనుగ్రహ మున్నంత వరకు నాకేమికొదవ!

కాళి :—రాకుమారా! తడయవలదు! నీకొఱకు బహిర్ద్వారముచెంత తేరుసిద్ధముగా నుండును! పొమ్ము!

సుద :—మహాప్రసాదము (అందఱునమస్కరింప కాళిఅదృశ్యమగును)

మనో :—నాయనా! ఇప్పటికి నిర్భయము కలిగినది దేవియాజ్ఞ నెర వేర్పుము!

సుద :—మీరంతఃపురమున కేగుడు (అందఱునిష్క్రమింతురు)

## 6 వ రంగము

(యుద్ధభూమియందొక నిర్జనస్థలమున - యు - శత్రు - ప్రవేశము)

యుధా :—అబ్బాయిూ! మనము చేసినప్రయత్నము తప్పక ఫలించును!

శత్రు :—(నిరుత్సాహమున) ప్రయత్నముఫలించుటయాకల్ల! కల్ల!! సామంతరాజులు వేరెన్నికగొన్న మహాబలసంపన్నులు కొందఱు నాశాసనము నిరాకరించిరాకుండిరి తోడ్పడినవారలా! ఒట్టిపిఱికి బంట్లు పౌరుషబలప్రతాపహీనులు వారివల్లనా? నాకువిజయము కల్గుట! తాతా! సహించుటదుర్భరము! దుస్సహము!! సుద ర్శనుడు సుబాహు ధీమంతాదులగూడి కాలుగదుపకుండ పోరాడు చున్నాడు. నేటికాతుచ్ఛునిప్రతాపమే. అప్రతిహతముగానున్నది.

యు:—నాయనా! జయాపజయములు, ఈశ్వరస్వాధీనములు ఇంత టితో నిరాశవహించిన, ఫలమేమున్నది నేటియుద్ధరంగము ఎంత భయంకరముగా ఎంతదారుణముగా ఎంతశౌర్యధైర్యస్థైర్యసాహసా ద్భుతవీర్య ప్రతాపవంతముగా ప్రదర్శింపబడునో నీవే పరీక్షించి వినోదంబున నోలలాడెదవుగాక!

మ. విలసద్బాణ పరంపరల్ పఱపి పృ థ్వీశ సర్వస్సైన్యాళితో
ఖలులౌ మంత్రి సుబాహువీరవరులన్ ఖండింతు నాపైన శ
క్తులులేకుండిన పక్షిచందముగ నీ దుర్గజాలు నీవైరి చిం
తలుదీరన్బరి నేలుదీవు మదిను త్సాహంబుదీపింపగన్.

ఆయుష్మంతుడా! వృథామాటలతో ప్రయోజనములేదు ఇదే నాప్రతిజ్ఞనాకర్ణింపుము!

చ. సమరముఖంబునన్ రిపుల జంపి జయంబు బరిగ్రహించుటో
విముఖులుగాని వైరిజన భీకరఖడ్గ శిలీముఖంబులన్
సమసి వియచ్చరాంగనల సౌఖ్యములందుచు సంతసించుటో
యమరెడుదాక పోరు పరకూాద్భుతశక్తి నొనర్తుజూడుమా.

ఇందులకు తప్పదునేని, పితృపితామహ ప్రపితామహుల పుణ్యగతులకు తప్పుదుగాక!

శత్రు:—తాతా! సర్వము దెలిసిన మీకు నేను చెప్పవలదేమున్నది! కార్యభారమంతయు తమయధీనమేకదా?

యు:—కుమారా! నీకాసందేహమక్కరలేదు రమ్ము. (ముందుకు పరి కించి) నాయనా! అదిగో! వీరసేనుడు కాబోలు నన్నెదిరించుటకు సిద్ధపడుచున్నాడు. నీవిందే విశ్రమించి యుండుము. నేనాతని యమాలయంబున కతిథి నొనర్చెదగాక!

శత్రు:—మంచిది అట్లే గానిండు. (తానొకచో గూర్చుండును.

(ధనుష్పాణియై యుధాజిత్తు వీరసేనున కెదురుగా నడచును)

వీర:—ఓరీద్రోహీ! ఉత్తమ క్షత్రియాన్వయబడబానలా! నీదురా

లోచనము లిప్పుడెట్లు పరిణమించినవో ముందెట్లు కానున్నవో? విచారించితివా ?

గీ. పాలు నీరును పుష్పము | పరిమళంబు
రత్నమును కాంతి రవిఛాయ | రహినిగూడి
యుండువిధమున సోదరు | లుండకుండ
కలహమును బెంచితివి నీవు | కలుషహృదయ.

ధర్మాధర్మజ్ఞాన శూన్యుండవై నీతిదొఱఁగి బాల్యచాపల్యమున రాజ్యాపేక్షితుడైన శత్రుజిత్తుకోరిక వలదని తెల్పుటకు మారు వయోజ్ఞాన సంపన్నుండవైన నీవే యిట్టి దుష్కార్యమునకు బాల్గొనుట జెల్లునా? నీ నిర్మలకీర్తి నశించునైన గుర్తించలేక పోయితివే?

చ. కనికరమించుకంతయును | గాంచక లోభగుణంబుచే సుద
ర్శనుని భయంకరాటవిని | జంపగబంపిన తత్ఫలంబు నే
డనుభవమొందజేతు నిదె | యాహవభూమిని వెన్నుజూపకే
సునిసితసాయకంబులను | శూరతజూపర దుర్మదాంధుడా.

యుధా :—ఛీ! పారుబోత! నోరుమూసి వీరత్వము గనబఱుపుము లేదేని జితోస్మియని యడుగులంబడుము. వృధాకారులఁ బేలిన నీ నాలుక వేయి చీలికల గావించెద.

ఉ. ధాత్రిసమస్తమున్గొని య|థావిధి మన్ననతోడ నేలగా
పాత్రుడు శత్రుజిత్తుడు నృ|పాలున కగ్రసుతుండుగాన నీ
పౌత్రుని భంగపుచ్చుటది | భావ్యముగాదె? విధిప్రయుక్తమా
క్షత్రియధర్మముల్ దెలియ | జాలని వెఱ్ఱి ప్రసంగమేటికిన్

ఓరీ! అసంబంధప్రలాపా! ఆత్మశ్లాఘుపరాయణా! వీరసేనా! నీవాచాడంబరంబులు వీరాగ్రేసరుండగు యధాజిత్తు ముందు పనికి రావని తలంపుము.

ఉ. ప్రాణములుండునంతకును | వైరిజనాటవి నాదుబాణజా
లానలకీలలన్ దహన | మద్భుత భంగినొనర్తు ధారుణిన్

మానము శౌర్యముఁ బలము \ మానితకీర్తి వశింపజేయుకే
వ్వానికమీరనన్నదిరి \ పోరుసపల్వర \ మందభాగ్యుడా ॥

ఓరీమూర్ఖచిత్తా! మదీయశర పరంపరల యభిరుచి జూచెదవు గాక !

వీర:—ఛీ ఛీ పౌరుషహీనా ! రమ్ము

(ఇరువురుధనుష్పాణులై నిష్క్రమింతురు)

(మరియొకదిశను - సుబా ! సుదర్శన ! ధీమం ! ప్రవేశింతురు)

సుబా:—(ఆశ్చర్యమున) ధీమంతా ! ఏమీయద్భుతము? రణరంగము నేడెంత భయంకరముగా నున్నదో చూచితివా !

మ. కరులున్గూలె! రథాశ్వసంచయము నుగ్గైపోయె సైన్యంబు దు
ర్భరశస్త్రార్చుల సీల్గుచుండిరదిగో \ రక్తప్రవాహంబు సం
గరభూమిన్ బ్రవహింపగ దొడగె లో \ కంబెల్లగంపింప భీ
కరభేరీనినదంబునిండెదిశలన్ \ గల్పాంతవేళార్భటిన్

ఆహా! ఇరుపక్షములవారు పరస్పరవిజయాపేక్షితులై ఘోరముగా పోరుచున్నారు !

ధీమం:—ప్రభూ ఔను! (చేతజూపుచు) ఈప్రక్కనించుకంత పరిశీలింపుడు సింహంబులు సింహంబులు శార్దూలంబులు శార్దూలంబులు గజంబులు గజంబులు ఢీకొను విధంబుగా ననుకరింపుచు ఉభయసైనికుల కుత్సాహప్రోత్సాహములు గల్గింపుచువీరసేనయుధాజిత్తులు చిచ్చఱపిడుగులై ప్రళయకాల రుద్రావతారులాయన వీరరసావేశంబునజూపరుల గుండె లవియపోరాడుచుండిరి.

సుబా:—అంతియేగాదు వీరసేనమహారాజుగారు తమశరసంధాన కౌశలంబున యుధాజిత్తును కీలుబొమ్మరీతి నాడింపుచు నలుదిశలుచూచుటకైనను తూణీరమందలి బాణములందు కొనుటకైనను! అవకాశమివ్వక చిత్తజల్లు విధంబునవాడి ములుక్కులనొప్పించుచున్నాడు.

సుద:—మహాశయులారా! మాతామహుని పరాక్రమమెంతయు శ్లాఘనీయమైనది. నిముషమాత్రమున విరోధుల తల్లడిల్లజేయుచుండెను.

సుబా:—(ముందుకుపరికించి) ఓహో! ఆశ్చర్యము కన్నుదెఱచి మూయునంతలో యుధాజిత్తు వీరసేన ప్రభుని శరాసనంబు ఖండతుండెములుగా జెండి ధరామండలంబునం బడవైచి కేరడింపుచున్నాడు.

ధీమం:—విరోధిపరిహాసంబు సహింపక తీవ్రవర్ష ధారలకు జలింపనివృషభరాజంబులీల వైరిసాయకంబులకు బెగ్గడిల్లక ప్రబలమేఘ పంక్తుల నెగజిమ్ము జంఝానిలంబు చందంబున దెజివిజేసికొని కోటిసూర్యులకాంతి తిరస్కరించు దివ్యాస్త్రంబు సంధించి నేదియోపలుకుచున్నట్లున్నదా కర్ణింపుడు! (అందఱు వినుటభినయింతురు)

(తెరలో)

ఉ. సత్యపథానువర్తనము సాక్షిగనమ్మి చరింతునేని దు
ష్కృత్యములాచరింపుటకు జిత్తమునన్ దలపోయనేనియున్
బ్రత్యహమాత్మధర్మముల బాయక నొప్పెదనేని నీకిదే
మృత్యువుగల్గుగాకను ని మేషము లోపల దుష్టచిత్తుడా

సుద:—(సంతోషమున) మేలు! మేలు!! మాతామహుని అమోఘాస్త్రంబుచే దురాత్ముడగు యుధాజిత్తు నెత్తురుగ్రక్కుచు రణోర్విగూలుచున్నాడు.

సుబా:—ఔను; ద్రోషి తన పాపఫలమనుభవించెను.

ధీమం:—కుమారప్రభూ! సుబాహురాజేంద్రా; అదిగోచూచితిరా! పరమ కిరాతకుడైన ఆ యుధాజిత్తు మరణించినంతనే సకల సైన్యములు తిన్నతిన్నగా వెన్నుజూపుచు పరాజితులై బర్విడుచుండిరి.

సుబా:—(నలుదిశలఁజూచి) అమాత్యపుంగవా! లేదు! రణ పరాంగ్ముఖులగు నిజసైన్యపరాభవంబు సహింపజాలక శత్రుజిత్తు దవక్ర విక్రమపరాక్రమ తేజోనిధివలె నేదియో వేలుచున్నా డాలకింపుడు.

(అందఱు వినుటభినయింతురు) (తెరలో)

ఓ సర్వసేనానాయకులారా; శత్రువిచ్ఛిన్నదివ్యాయుధ ధారులగు రాజపుంగవులారా! పౌరుషహీనులై పారిపోవవలదు చెదరా!

ఉ॥ దేహములస్థిరంబులు గణింపకనిల్వవు యొంతగాచినన్
బాహుబలప్రతాపమున ♦ వైరులబట్టి వధింపలేక సం
దేహము జెంది బాఱబడి ♦ భీరులకర్హము గాకు నేటి కో
హో "హతశేషులార; నిలుఁడుగ్రరణంబున ధైర్యవంతులై.

సుబా:—కొంతవరకితఁడు వీరపురుషోచిత ప్రసంగములనే ముచ్చటింపుచు తనదళముల ప్రోత్సహింపుచు మదగజంబులపైకి లంఘించు సింహపుకొదమువలె మన బలంబుల నెదుర్కొనుచున్నాడు.

సుద:—మామా; ఎదుర్కొనుటయేగాదు తృటికాలమున జూచువారి కనులకు మిఱుమిట్లుగొల్పుచు తన శరపరంపరల నలుదిక్కుల బిక్కటిల్ల జేయుచు పరాజితులగు సామంతరాజుల బిరికొల్పుచు మన చతురంగబలంబుల నుఱుమాడ దొడంగెను.

గీ॥ కాననంబెల్ల జుట్టిన ♦ కారుచిచ్చు
చందముగ దోచు నయ్యది ♦ శత్రుజిత్తు
డిపుడు దడయుగ మోసమం ♦ తేనిగలుగు
నేది కర్తవ్యమో ముందు ♦ యెంచవగును.

పూజ్యులారా! నాకింక సెలవొసంగుడు. నే నాదుండగీని కండగర్వ మణంచెదగాక! (నడువయత్నించును)

ధీమం:(సుదర్శనునడ్డగించి) కుమారసింహా; సాహసింపవలదు. సుకుమార శరీరుడవు పసివాడవు నీవా కఠినచిత్తుని మీదికేగవలదు. నా జీవిత సర్వస్వము త్రికరణశుద్ధిగా నీకర్పించుటకు సిద్ధముగా నుండ స్వయముగా నీవేల రణంబు సేయనెంతువు? తండ్రీ! ఈశత్రుజిత్తేకాదు. త్రిజగంబుల వారెత్తివచ్చినను వెనుకంజవేయక వీర విహారంబొనర్చి విజయలక్ష్మీసహితంబుగా నయోధ్యానగర

సామ్రాజ్యలక్ష్మిని నీయర్ధాంగలక్ష్మిని గావించెద (సుబాహుని జూచి) మహారాజా! అబ్బాయిగారితో తా మా నిర్జనస్థలంబున విశ్రమించి నాయుద్ధనైపుణ్యము బరీక్షింతురుగాక!

సుబా:—సచివరోత్తమా! రణంబున నీ వప్రమత్తుండవై వైరి మారణంబును నిజసైన్యరక్షణంబొనర్చుట సర్వజన శ్లాఘనీయ మగును!

ధీమం:—ఏలినవారి యాజ్ఞ నిర్వర్తించుటయే నాకర్తవ్యము:

(ధనుష్పాణియై నిష్క్రమించును)

సుబా:—నాయనా! సుదర్శన! మన మాయున్నతస్థలంబున విశ్రమింతము రమ్ము! (ఇఱువురునిష్క్రమింతురు)

(మఱియొకదిశ శత్రుజిత్తు విచారమున ప్రవేశించును)

శత్రు:—(తనలో) హా; హతవిధీ! శత్రుదళంబుల కోటాను కోట్లను జీల్చి చెండాడిన పితామహుండు తుదకావీరసేనహతకుని బాణమున కెఱయై వీరస్వర్గమలంకరించెనే? పగతుర నిర్మూలన మొనర్చి నిఖిల మహీమండల సామ్రాజ్యాభిషేకముగావించునని పుట్టెడాశతో నున్న నాపన్నుగడలన్నియు నిష్ఫలములాయెనే? దైవవిధి కేమన వలయును?

చ. రథములుగూలె ఘోటకములు§వ్రాలె గజంబులు ప్రోవులయ్యె సా
రథులునశించి రాశ్వికులు § ప్రగ్గిరి వీరులు నీల్గిరక్కటా;
ప్రథనమునందు తాతపడి § స్వర్గపురంబునలంకరించె మా
నధనుడ, నే సహింతునె? మ § నంబున వైరుల దుష్ప్రలాపముల్.

(ఆలోచించి) ఇదియు కొంతమేలుగాయున్నది మదీయబాణ ప్రహారంబులకు భయగ్రస్తులై రిపుసైన్యంబులు చెల్లాచెదరై నిరుత్సాహంబున తలదాచుకొన బఱుగులిడుచుండిరి. (ముందుకుపరికించి) ఓహో! పరాజయ సూత్రమును పఠించు నిజబలంబుల బురికొల్పుకొని వృద్ధుడైనను వీరసేనుడు యువకునివలె నా సర్వసైన్యముల నరికట్టుచున్నాడు ఔరా! ఈ రెండు పక్షములవారియందితడు మహాశూరు

డని దలంపవలయును కాని యుష్మ ఏదెట్లైననుసరే! బాందిలో యూపిరి యుండువరకు యుద్ధమాత్రాను (యుద్ధభూమి పరిశీలించి) భళి భళీ! ప్రతాపసింహా; నీసాహసము కొనియాడదగినదోయి! నాప్రియ మిత్రుడవై నందులకు నీవిప్పుడు వీరసేనునిదాకి మహాభయంకరముగా బోరుచుండు నీకు నేనెంతయు కృతజ్ఞుడను (ఆశ్చర్యమున) ఓహో! వ్యాఘ్రప్రవేశమున తల్లడపడు పశుగణంబుకీతి మద్భటసందో హంబును దెఱిపిగావించి శోకద్రోక్కన ప్రతాచుపామువలె రోష గ్రస్తుడై ధీమంతుడు నన్నుడీకొనుటకు కాబోలు ఇటేవచ్చుచున్నాడు! (ఆలోచనవహించి) మంచిది ముందితని తుదముట్టించి పిమ్మట సుదర్శ నాదుల రూపుమాపెదగాక! (సగర్వముగా ముందుకునడుచును)

(ధనుష్పాణియై ధీమంతుడు ప్రవేశించును)

ధీమం :—ఓరీకులద్రోహి. విశ్వాసఘాతకా; నాడా సరయూనదీజల స్నానమాచరించు నిరాయుధుని బంధించి కారాగారమునద్రోయిం చిన ధీమంతుడు కాడిప్పుడు సకలవీరశిరఃఖండనోద్దండ ప్రభామండిత కోదండ ఘటితశర ప్రకాండుడైన ధీమంతుండని దలంపుము కపటశీలుండవగు నీకుండెలు జీల్చి జెండాడ రెండవ దండధరుండని భావింపుము! కుమతీ! నీవుచేసిన పాపమునకు ప్రతీకారమనుభ వించెదవు!

సీ. కుటిలచిత్తుల తోడ కూడి యోచనసల్పు
సీమగాదిది యుద్ధ భూమిగాని
పసిబాలకునిజంప బంపించుటిదిగాదు
భయము గొల్పెడు వీర భటులుగాని
ధర నిరాయుధునన్ను జెఱబట్టుటిదిగాదు
ఘోరాస్త్రయుతులతో పోరుగాని
సాధుజనంబుల బాధించుటిదిగాదు
విదితశౌర్యులదాకు యదనుగాని

గీ. పాపచిత్తుడ ! నినుబట్టి భండనమున
కత్తి కోత కండగాగోసి కాకి గ్రద్ద

లకును విందును గావింప సుకృతమబ్బు
గాని, కలుషంబు గలుగునే? హీనచరిత.

ఓరీ ద్విపాదపశువా! యుక్తాయుక్తజ్ఞానశూన్యుడవై

ఉ. తాతహితోపదేశమున తమ్మునిజంప దలంచినట్టి దు
ర్నీతివి మంచి చెడ్డలు గణింపక నన్ జెఱసాలనుంచి యు
ర్వీతలమేలనెంచిన వివేకవిహీన! తదీయపాతకం
బీతఱి నీకులభ్యమగు నించుకసంగరసీమ నిల్చినన్

ఛీ! ఛీ! దురాశాపాశబంధీకృతహృదయా! నీకుటిలాలోచనములింక సాగిరావు పౌరుషప్రధానుడవేని భుజబలము క్షాత్రముజూపుటకు సిద్ధపడుము!

శత్రు:—ఓరీకృతఘ్నుడా! ఇంతకాలము మాయుప్పు పులుసులుతిని కండక్రొవ్వుబట్టి యొడలెఱుంగక మిడిసిపడుచు మాముందు నీవే నాపైకత్తిగట్టి అకారణవిరోధమును సంపాదింప సాహసించితివిగా దురాపశదా!

ధీమం:—ఏమిరా! నీప్రేలుడు కుటిలుడా! నిరపరాధియగుసోదరుని నిర్జనారణ్యమున సంహారింపబంపుటయు బాల్యమునుండి నీదుండగములువిని కన్నులార చూచిసహించి నీక్షేమమునకపేక్షించిన నన్నుకారణముగ జెఱసాలనుంచి చేయరానియూడిగములు చేయించుటయు ఎండకన్నెరుంగక చంద్రకాంతశిలాలంకృత సౌధాంతరమున దాసీజనపరివృతయై నిరతభోగియైన మహారాణిగారిని పురంబు వెడలనడుపుటయు చెప్పరాని ఘోరకృత్యములాచరించుచు రాష్ట్రప్రజల యుసురోడిగట్టుకొనుచు నేబుద్ధిమంతుండనని విఱ్ఱవీగుచు యుద్ధమునకు సిద్ధపడితివా! కుమతీ!

ఉ. చేసినతప్పులన్ మరచి శ్రేష్ఠునిభంగి చరించినంత శా
బాసని మెత్తురేజనులు? పాపముదాచిన దాగబోదు యే
వేసము వేసినన్ మరణ వేదన తప్పదునీకు తాతసా
వాసఫలంబునేడనుభవంబగునమ్ముము! మూర్ఖచిత్తుడా.

దుష్టజనసహవాసఫలము కట్టికుడుపక యూరకపోవునా?

మ. ఖలుడా! యేటికి ప్రేలెదీవిపుడు సం గ్రామస్థలిన్నిల్చి శూ
రులు మెచ్చంగలన వెన్నుజూపకను నేఁ గర్వింక జూపుటో లేకభూ
తలనాథుండగు నాసుదర్శనుని పా దద్వంద్వమున్పట్టి త
ప్పులు మన్నింపగ వేడుటో తగును నీ మూర్ఖత్వమున్బాయుచున్.

శత్రు :—(సక్రోధముగ) ఛీ! బానిశాధమా; ఏమిరా నీకండమదము? మాయుడుగడుగులకు మడుపులొత్తుచు మాశాసనములకు తలవంచి బ్రతుకునీవా? నన్నధిక్షేపించువాడవు? నీవుచేసిన దుర్మార్గములకు నీకపట ప్రయత్నములకు నీమిత్రభేదబుద్ధికానాడు చెరసాలయం దుంచితినిగాని తలనఱికించినచో ఇప్పుడీ శ్రమలేకుండెడిది మితిలేని ప్రల్లదములాడుచున్నంత మాత్రమున ఈ శత్రుజిత్తు శరణమపే క్షించుననుకొంటివా?

ఉ. బొందిలో ప్రాణమున్న నిను బోటికృతఘ్నుల నాజిగూల్పకే
పందవిధంబుగా వెఱచి బారగనెంచునె? దుర్మదాంధ; జూ
పందగునేమనీబలము పౌరుషముల్ భుజశక్తిగాని యీ
చందము కారులన్ బలుక శౌర్యధనుండెటులాదరించెడున్.

ఓరీ! విశ్వాసఘాతకా; వృథాప్రసంగంబులు గట్టిపెట్టి రణంబున కాయత్తమగుము నిమిషమాత్రంబున యమాలయంబున గింకరుని గావించెద.

భీమం :—ఛీ! పితృద్రోహీ! నీకిదే తగినశాస్తిగలుగుగాక

(ఇరువురు చెయ్యిచెయ్యికలుపుచు నిష్క్రమింతురు)

7-వ రంగము

(రక్తసిక్తాంగుడై తూలుచు ప్రతాపసింహుడు ప్రవేశించును)

ప్రతా :—(తనలో) ఓయీ శత్రుజిత్తుమహారాజా! నీ సహవాసము నన్నెంతవరకు తెచ్చినదోయి? అన్యాయమునకు పాల్గొని నీయాజ్ఞ ననుకరించి ధర్మమూర్తియగు సుదర్శనాధిపునిపైకి దండెత్తి

నిష్కారణముగా సర్వసైన్యముల జంపుకొని తుదకావీరసేకుని శర పరంపరలచే జర్జరితాంగుడనై జావనుంటినే? హా! బాధ! ఏమిది (శరీరము చూచుకొని) నాశరీరమంతయు జల్లెడవలె రంధ్రములై రుధిరమెట్లు స్రవించుచున్నదే! నా తనువు కండకండలు చీల్చబడి యున్నందున కాకోలు భగ్గు భగ్గున మంటలాడవుచున్నవి. నోట తడియారి నాల్క పిడచగట్టుచున్నది. అయ్యో! నాశరీరముతో పాటు కనులు గిఱగిఱ దిరుగుచున్నవే ఓ ప్రతాపసింహా! ఇంకె క్కడి జీవితాశ! నేటికి నీకాయుర్దాయము చెల్లినది. ఆ! ఎవరది!! ఏమనుచున్నారు! దుర్జనస్నేహమున సాధువృత్తినుండు పుణ్య వంతుల గారించినందుల కీయనుభవ మనుభవింపవలసినదనియేనా పలుకుచుంటిరి? ఓ ధర్మమూర్తులారా! నాతప్పుక్షమించండి నే తెలిసి తెలియక యుధాజిత్తుశత్రుజిత్తుల దురాలోచనల జెవినొగ్గిమరణ పర్యంకమలంకరింపుచుంటిని.(సుదర్శనుని దలంచి)సుదర్శనప్రభూ!నా యపరాధములుమన్నింపుము. నాకు మీరన్నదమ్ములు. సమాన పూజ్యార్హులగుటగు ర్తింపక నేచేసినదురాగతకృత్యమునకు ప్రతిఫల మనుభవించితిని. "యతోధర్మ స్తతోజయః" అన్నట్లు నీవు సమర విజయులబ్ధుండవై అయోధ్యానగరసామ్రాజ్యధౌరేయుండవై సుఖం తువుగాక ! సుఖంతువుగాక !! (నిట్టూర్పుబుచ్చి) ఉస్సు! అబ్బా! బాధ దుర్భరముగా నున్నది. నేనింక జీవింపజాల! జీవింపజాల !! (ఆకసముచూచి) ఆ ! ఎవరది ! నన్ను పిలుచుచున్నవారలు ? ఓహో! గ్రహించితి దేవకన్యలా! నన్నురమ్మని ఆహ్వానింపు చుంటిరా! నిలుడు! నిలుడు!! ఇదే మిమ్ములగలిసికొందును.

(లేచి నడిచి తూలిక్రిందపడి ప్రాణములు విడుచును.)

(మరియొక దిశను సుబాహు - సుదర్శనులు ప్రవేశింతురు)

సుద :—ఆర్యా! నేడు సమరమెంత ఘోరముగా పరిణమించినదో చూచితిరా?

సుబా:—చిరంజీవీ! ఔను. ధీమంతుని చిరకాలపరాభవానలజ్వాలల రగుల్కొని వైరి జనారణ్యమును దహించుటలో సందేహమే

[illegible]న్నది! భువనైక మాతయగు సావిత్రీదేవి యనుగ్రహము వడ [illegible] పతికార్యమున కంతరాయముండునా! (యుద్ధభూమిని చూచి) సుదర్శనా! అదిగో! ప్రాయమున బిన్నవాఁడైనను శత్రుజిత్తుడ పూర్వవిక్రమపరాక్రమ సంపన్నునివలె అనాయాసముగా నమాత్యునితో పోరాడుచున్నాడు

సుద :—(ముందుకు పరికించి) మహాత్మా! మోసము! మోసము!! ధీమంతుని డీకొనుటయేగాదు శిత తీవ్రసాయక ప్రసారంబుల మంత్రి వృంగవుని నొప్పించి గతప్రాణునిభంగి భూమినింబడజేసెను! సచివోత్తముడు విగతచేష్టితుడై మూర్ఛిల్లుచుండెను! హా! విధి వైపరీత్యము! తల్లీ! కాత్యాయనీ! నిన్నాశ్రయించిన వారి కిదియా ఫలము!

గీ. నానిమిత్తంబుగా మంత్రి ప్రాణ[illegible]ను
శత్రుజిత్తునకర్పించి [illegible]
మూర్ఛచెందెను [illegible]
నేమిసేయుదు? [illegible]!

పితృవత్సలా! ధీమంతా! నాకొరకుపడరాని బాధలంబడి తుదకా క్రూరునివాతబడితివా? (విచారమభినయించును)

సుబా :—సుదర్శనా! విచారింపవలదు. జయాపజయంబులు దైవాధీనములు మనమునిమిత్తమాత్రులము (ముందుకుపరికించి) సహజ ధీరోదార పరాక్రమ నిధియగు ధీమంతుడదిగో మూర్ఛదేరి ప్రేటుతప్పిన బెబ్బులివలె ఘృతధారాభిషేకహుతాశనునిభంగి మండిపడుచు తీవ్రక్రోధమున చిచ్చఱపిడుగై దురాత్ముడగు నీవిరోధి శరీరమంతట శరవర్షధారలగ్రుచ్చి సుడిబడజేసి భయకంపితుని గావించె!

సుద :—(ఆనందమున) మహాత్మా! అంతియేగాదు ధీమంతునిదాడికి సహింపలేక ప్రచండమారుత ప్రఘాతంబునజలించు బాలలతావి

తానంబు చందంబున సర్వాంగ సంచలితగాత్రుఁడై పలాయన మపేక్షింపు చుండెను!

సుబా :—కుమారా! కోరలు బెఱికిన త్రాచుపాము రీతి రోజుచు.

గీ. భయవిషాదము లలవడి ♦ పాఱిపోవు
శత్రుజిత్తుని వెన్నంటి ♦ సాహసమున
పట్టి బంధింపుచుండె, ని ♦ ర్భయముగాను
అమితబలశాలి ధీమంతుఁ ♦ డదిగో! గనుమ.

సుద :—రాజేంద్రా! పట్టుబడిన శత్రువునితో యమాత్యశేఖరుండిట కరుదెంచెను వీక్షింపుము!

(శత్రుజిత్తునితో ధీమంతుడు ప్రవేశించును)

ధీమం :—జయము! సుదర్శనమహారాజా! జయము!!

చ. ఇతడె భవద్విరోధి పరు ♦ గెత్తదొడంగెను యుద్ధమందు ప
ట్టితి వెనువెంటనేగి విను ♦ డీ; ఖలుడీతని సంహరింప బూ
నితి సెలవిచ్చిబంపదగు ♦ నిక్కముగా రణశేషుఁడైన వా
డతికఠినుండు ద్రోహి కపటాత్ముఁడు మిత్రకృతఘ్నుఁడెంతయున్.

మహాప్రభూ! ఏలినవారికోర్కె దీర్పగల్గినందులకు నేను కృతార్థుడనైతినని గర్వింపుచుంటిని. క్షమించి కర్తవ్యమును విధింపుము.

శత్రు :—(విచారముతో తలవంచి) సోదరా! క్షమింపుము! క్షమింపుము!!

సీ॥ నిరపరాధిని నిన్ను ♦ కరుణింపకను ఘోర
వనమునన్ దెగటార్ప ♦ బంపినాఁడ
మనకాప్తుఁడైన యీ ♦ మంత్రిని బంధించి
జెఱసాల నిడుములు ♦ జేర్చినాఁడ
పరమసాధ్వీమణి ♦ పట్టమహిషికి కత్తి
కోతగా దుఃఖంబు ♦ గూర్చినాఁడ
రాజ్యాభిలాషచే ♦ పూజ్యుల కనిశంబు
కడగండ్లు గూర్పంగ ♦ దొడఁగినాఁడ

గీ॥ చెప్పరానట్టి చెడుపనుల్ జేసినాడ
చేసినటువంటి పనికిప్డు చింతజెంది
నాదు యపచార శతముల న్నాదరించి
దయను రక్షింపనెంచుట ధర్మమయ్య.

ఉ॥ తప్పును సల్పినాడను సుదర్శన ! నీయెడ ద్రోహబుద్ధితో
నిప్పుడు బుద్ధివచ్చెను సహింపుము నా దురితంబు లెల్ల పె
న్ముప్పుఘటించు లెంచకను మూర్ఖుడనై పగదెచ్చుకొంటి మూ
యప్ప; క్షమింపుమింక భవదంఘ్రులకే ప్రణమిల్లుచుండెదన్.

(సుదర్శనుని కాళ్ళపైబడి గట్టిగ పట్టుకొనును)

సుద :—అన్నా; ఇదేమి దురన్యాయము? పెద్దవాడవు నా యడుగు లంటతగదు. విడువుము.

శత్రు :—తమ్ముడా! భ్రాతృద్రోహికిదియేశాస్తి. నీవభయ మొసగు వరకు నాకివియే శరణ్యములు.

భీమ :—(సక్రోధమున) రాకుమారా! ఈసోదరద్రోహి శిక్షార్హుండు గాని క్షంతవ్యుడుకాడు! క్షంతవ్యుడుకాడు!! (శత్రుజిత్తునిచూచి) ఓరీ దుష్టుడా! నిన్నింకరక్షింపవలయునా? నీ చేసిన పాపమునకు నీతల వేయుచక్కలుగా నఱికి కాకి గ్రద్దల కాహారమొనర్ప దోష ముండునా?

సుబా :—నాయనా! ఈ పాపచిత్తుని కత్తికొక కండగా జెండాడ వల సినదేగాని క్షమింపవీలులేదు.

(వీరసేనుడు తొందరలో ప్రవేశించి) ఆయుష్మంతుడా; వలదు! వలదు!! నామాటయొకటాకర్ణింపుము.

గీ॥ భువిని రణశేష రుణశేషములను దీర్ప
కున్న మోసంబు ఘటియించు నుగ్రముగను
ఖలుడు యీతని శిరమును ఖడ్గధార
దెగవధింపగ దగును సందేహమేల?

పరమదుర్మార్గుడైన ఈకపటచిత్తుని రక్షింప నామనంబు సమ్మ తింపదు! సమ్మతింపదు!!

సుద :—(చేతులుజోడించుకొని) పూజ్యులారా! నామనవి చిత్తగింప ప్రార్థించెదను. మానవుడు తానుచేసిన పాప పుణ్యములు స్వయముగా విమర్శించుకొని తనదోషమును గుర్తించి ఎప్పుడు పరితపించునో అప్పుడే గత కల్మషుండగునని సకల శాస్త్రపురాణంబులుద్ఘోషించుటలేదా? వేయేల! భయాతురుడై శరణన్న పగవానినైన రక్షించుటయే కదా! క్షత్రియధర్మము!

చ॥ పలువురుజూచుచుండ తటి కే పాదములన్ బడి భీతిచేత చిం
తిలెడు సహోదరున్ గినిసి క ధీరతబట్టి వధింప నామనం
బలమటజెందుచుండె! గృపకానారసి యాతనిబ్రోవఁ జెల్లుతే ...
దలపగ ధర్మమౌను వసుధాజనులెల్ల సుకీర్తిలభింపఁ నయ్యెడున్.

మహాశయులారా! తామిందుల కంగీకరింతురని నా ఆశయము.

వీర సుబా ధీమం } సంతోషము! సంతోషము!! నాయనా! సుదర్శనా; నీయభిప్రాయము మేమందరము శిరసావహించెదము. నీ శరణాగత పరిపాలనంబు జగద్విఖ్యాతమై నీ దయాస్వభావము సర్వదా ప్రశంసనీయమగుగాక!

సుద :—(లేవనెత్తుచు) అగ్రజా! లెమ్ము భయపడకుము.

శత్రు :—(లేచి చేతులుజోడించి) మహాశయులారా! తెలివిమాలి నే చేసిన దుండగములు మన్నింపుడు. తమ్ముడా! సుదర్శనా! నీయనుగ్రహమున నేనిప్పటికి పునర్భవునివలె నిర్భయుండనైతిని.

సుద :—అన్నా; ఇందునీదోషమావంతయులేదు? నా పురాకృతకర్మఫలంబుగాని మఱొండుగాదు!

(కాశకసహితుడై భారద్వాజమహర్షి ప్రవేశించును)

(అందఱు నమస్కరింతురు)

సుద :—(ముందుకునడిచి) ప్రాణదాతలైన గురువర్యులకు నమస్కారశతంబులాచరింపు చున్నాడను.

(భారద్వాజుని పాదములపై వ్రాలును)

భార :—దీర్ఘాయుష్మాన్భవ! దీర్ఘాయుష్మాన్భవ !! (లేవనెత్తి)
వత్సా! నీవిప్పటికి సర్వవిధముల ధన్యుడవైతివి.

సుద :—మునికుల సార్వభౌమా! తమకృపాప్రసారప్రాప్తిచే సఫలీకృతమనోరథుండ నగుటకేమి సంశయము?

సీ. భవదీయ వాత్సల్య ౹ పటిమచే నీచుని
బాకు పోటును దప్పి ౹ బ్రతుకగంటి
తమగాధ ప్రియము చేతను బాల్యమంతయు
నిర్వ్యాచారంబుగ ౹ నెఱుపగంటి
విమలాత్మ; నీబోధ ౹ నమున శాస్త్రములందు
గలధర్మములనెల్ల ౹ దెలియగంటి
అనఘచరిత; నీ ౹ యాశీస్సుమహిమచే
వైవాహికప్రాప్తి ౹ బడయగంటి

గీ. ఉరుతపోధన శోభిత ౹ యుష్మదీయ
కరుణపెంపున ఘోర సం ౹ గ్రామవిజయ
మును గ్రహింపగ గంటిని ౹ బుధులు మెచ్చ
ధన్యతను జెందె! నాజన్మ ౹ తాపసేంద్ర.

తండ్రీ; మీరీదీనునకు చేసిన మహోపకారము పదునాల్గు జన్మలందైనను మరచునది కాదు!

భార :—కుమారా! ఇదంతయు జగదాంబయనుగ్రహంబున నీవురా కృత సుకృతఫలంబున లభించినవేగాని ఇతరులు నీకు చేసిన సహాయ మావంతయు లేదు!

వీర :—ఔను; సర్వజ్ఞులగు పెద్ద లిట్లనుట యథార్థమైనవిషయమే.

సుబా :—సంయమీంద్రా; ఇక ముందాచరించు కర్తవ్యమేది యో సెలవీయ వేడెద.

భార :—కాదగినదేయున్నది? మన సుదర్శనప్రభునకు సకలసామ్రాజ్యాభిషేక మొనర్చుటయు తదనుమతిని శత్రుజిత్తుని యువరాజ ప్రతినిధిగా కొంతరాజ్యమునకు నియమించుటయు ముఖ్యము ఐన నిట్లగుగాక; (భరతవాక్యము)

గీ. అన్నదమ్ముల కనిశంబు నైకమత్య
మలరుగావుత; దుర్బుద్ధి గలుగ కుండ
రాజ విశ్వాసపాత్రులై ప్రజలు భువిని
దనరుదురుగాక! సర్వదా ధర్మరతిని.

అందఱు తథాస్తు! తథాస్తు!! (కరతాళధ్వనులు జేతురు)

శత్రు:—పూజ్యులారా! మనమెల్లర మయోధ్యానగరము జేరవలయును దయచేయుడు!

భార
కాశి
వీర } మంచిది
సుబా
సుద

(అందఱు నిష్క్రమింతురు)

(అవనిక జారును)

గద్యము

ఇయ్యది శ్రీ మదలమేల్మంగా సమేత శ్రీ వేంకటేశ్వరస్వామి
కృపా ప్రసాదాసాదితసరస కవితాధురంధర ఆసూరి మరిం
గంటి సజ్జన వంశ పయః పారావారరాకాసుధాకర వేంకట
రాఘవాచార్య ద్వితీయపుత్ర మౌద్గల్యసగోత్రా
పస్తంబసూత్ర సద్గుణకదంబ వేంకట నరసమాంబా
గర్భశుక్తి ముక్తాఫలవిబుధజన విధేయ వేంకట
నరసింహాచార్య నామధేయ విరచిత శ్రీ
శశికళయను నాటకమున చతు
ర్థాంకము సర్వముసమాప్తము

శ్రీ శ్రీ శ్రీ

ఓమ్ తత్సత్